సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.

సంపుటము 45
సంచిక 53
2.9-53

సచిత్రవారపత్రిక
Founder: K. NAGESWARA RAO

విజయ శ్రావణ బహుళ దశమి: బుధవారం

# కోపించిన గోదావరి.



ఆగస్టు 10న గోదావరినదిలో వచ్చిన వరదలమూలంగా ఉభయగోదావరి జిల్లాలలోనూ కోటాను కోట్లు విలువగల ఆస్తినష్టమైంది. కష్టంలోవున్న ఆజిల్లాల ప్రజలకు విరివిగా విరాళాలు యిచ్చి బ్రతుకుపై విశ్వాసం పోకుండా చూడవలసిన బాధ్యత యావద్భారతంపైనా వున్నది.

ముఖచిత్రం : రోహిణీ వారి 9-వ నెం. చిత్రంలో అభినేత్రి జానకి.





# వం

"వైచిత్ర్యం బగు భూతపంచక మహా
ప్రాపంచికోత్పాతముల్
హా! చిద్విభ్రమ మేర్పడంగ కలచున్;
అట్లైనను జేతురా
రా! చిత్రం బది యేమొకాని బుధులే
యా శక్తి కారాధనల్;—
బూచిం జూపిన తల్లి యంకమునకే
పోవుంగదా పాపడున్."

తా॥ పంచభూతములతో కూడిన యీ మహాప్రపంచమునందలి భీభత్సములు చాలా విచిత్రమైనవి. అవి చిత్తవిభ్రాంతిని కలుగజేసి ఆందోళన కలుగజేయుచుండును. అది యేమి చిత్రమో కాని, అవిధముగా మన స్సుకు శాంతి లేకుండా చేయుచున్నప్పటికీ, ఏ శక్తి యీ ప్రళయ భీభత్సములను కలుగజేసి యీ మానవలోకాన్ని సుఖంగా బ్రతుకనిచ్చుట లేదో, ఆ శక్తికి బుధులైనటువంటి వారే (జ్ఞానులైనటువంటి వారే) ఆరాధనలు చేస్తున్నారు. పసిపాపకు బూచిని చూపించి బెదిరించినటువంటి తల్లి యొడిలోనికే, ఆ బూచిని చూచి జడిసికొన్నటువంటి బిడ్డ త్వరగా చేరుచున్నాడు.

బూచినిజూచి కంగారుపడిన బిడ్డ తన్ను తాను రక్షించుకొనలేనని గ్రహించినటువంటిదై, తనయొక్క అసహాయస్థితిలో ఏడుస్తుంది. ఏడవడం అనేది అవసరమా? అనవసరమా ? ప్రయోజనకరమా ? నిరుపయోగకరమా? అనేది యోచించవలసినవిషయమే. తన మనస్సుకు బాధ కలిగినట్లుగా గాని, తన దేహానికి నొప్పి కలిగినట్లుగా గాని, తెలియజేయడం ఒకవిధంగా అవసరమే. అడుగనిదే అమ్మయైనా పెట్టదు అనే సామెత ఉంది. తనకు ఆకలియైనట్లుగా తెలియజేయవలెను, తనకు బాధ కలిగినట్లుగా బోధపరచవలెను అంటే, సులభమైన పద్ధతి ఏడ్వడమే. ఈవిధంగా తన ప్రాణ సంరక్షణార్థమై, శరీరపోషణార్థమై గొంతెత్తి తనకోరికల నెరుకపరచుట అవసరము. ఇది కేవలము స్థూలమైన శరీరానికి సంబంధించిన అవసరము మాత్రమే. మనయొక్క అసహాయస్థితినిగురించి మనము తెలిసికొనినప్పుడు ఆవేదన పడ్తాము. చిన్నపిల్లలకు మాత్రమే గాక, పెద్దవాళ్లకు కూడా యిటువంటి ఆవేదన అనేక సందర్భాలలో కలుగుతుంది. ఈ హృదయ వేదనలోనుంచి రోదన వస్తుం[illegible] "ఏదిగతి నాకు?"అని ఆక్రోశిస్తాం "ఏతీ[illegible] దయజూచెదవో ఇనవంశోద్భవ రామా! తరమా భవసాగర మీదను? నళినద[illegible] రామా!" అని మొఱ పెట్టుకుంటాడు గోదావరిలో మునిగిపోతున్న పడవ ప్రయాణికునిలాగున.

ఆవిధంగా హృదయం తల్లడిల్లిపో[illegible] వాళ్లు యీ ప్రపంచంలో ఎంద రు[illegible] సరియైన లెక్కలు తయారుచేయ[illegible] వంతునకే సాధ్యం కాని, బాబు రా[illegible] ప్రసాదుకు కూడా సాధ్యం కాదు. జ్ఞా[illegible] లైనవాళ్లు చెప్పేది ఏమిటంటే, యీరీతి హృదయం తపించి కళ్ళనీళ్ళు కారి[illegible] రిన పిమ్మట, ఆత్మపరిపక్వమై, తన[illegible] పాన్ని తన శక్తిని తాను తెలిసికోగ[illegible] సాధ్యమవుతుంది అన్నారు.

"నేను కేవలం అసహాయుడను, [illegible] డను, అసమర్థుడను" అని ఏడుస్తూ కూర్చుం[illegible] డడంవల్ల, నిజంగా చిట్టచివరకు, అసమర్థుడే అవుతాడు. గుండెధైర్యం లేని వ్యర్థుడే అవుతాడు అని వాదించేటటువంటి తత్వజ్ఞులు కూడా ఉన్నారు. తనకు తాను ఏమీ చేతకానివాడననీ, తాను అప్రయోజకుడనైపోతున్నాననీ నిస్పృహ జెంది దిగులుపడుతూ వగచుచుండుట తగునా?

ఇది మంచిలక్షణం కాదు. ధైర్యంగా ఉండాలి. నూకలిస్తే మేకల్ని కాయవలె. పెద్దపులి వచ్చినా భయపడకూడదు. కాబట్టి ధైర్యసాహసాలు అవసరం. గుండెనిబ్బరం అవసరం. అటువంటి ఆత్మధైర్యం, ఆత్మవిశ్వాసం సాధకం చేసినవానికే ఆత్మశక్తి

వామనరావు

వ్యక్తమౌతుంది. అటువంటివానికే ఆత్మసాక్షాత్కార మవుతుంది. ఇది ఒకవిధమైన తత్వ జ్ఞానోపదేశం. ఇందులో కొంత నిజం ఉంది.

ఒక పెద్దమనిషి చాలా బలంగా ఆరోగ్యంగా దృఢంగా తిరుగుతూ పనిపాటులన్నీ చేసుకుంటూ ఉండేవాడు. అతని కండబలం అతనే చూచుకొని ఉప్పొంగిపోతూ ఉండేవాడు. తన స్నేహితులందరికంటె తానే బలశాలినని చెప్పుకొని విర్రవీగుతూ ఉండేవాడు. తాను ఒక్క గుద్దు గుద్దితే గిద్దెడు మిరియాలు రాలుతాయి అనేవాడు. అతని స్నేహితులకు అతనిమీద అసూయ కలిగింది. అతని ముఖ్య స్నేహితులందరూ కలిసి ఒక డజనుమంది ఉండేవారు. వీరిలో ముగ్గురు డాక్టర్లు కూడా ఉన్నారు. వీళ్లందరూ కలిసి చమత్కారంగా అతనిని ఏడ్పించవలెననే ఉద్దేశంతో ఒక కుట్ర చేశారు. ఆ పెద్దమనిషి ఒకనాటి తెల్లవారుజామున నిద్రలేచి బయటకు రాగానే "ఇదేమిటోయ్! ఇవేళ ఇదిగా ఉన్నావ్?" అని ఒక మిత్రుడు గుమ్మంలోకి వచ్చి పలుకరించి భావం తెలియని భాష్యం చేశాడు. ఆ పెద్దమనిషి బజారుకు వెళ్లగానే, బజారులో ఇద్దరు స్నేహితులు అతనికి వేర్వేరు వీధులలో కన్పించి "ఏమిటోయి! కొంచెం నలిగినట్టున్నావ్ మనిషివి? ఏమైనా సుస్తీగా ఉంటే, డాక్టరుకు ఒకసారి చెయ్యి చూపించి నాలుగు రోజులు మందు పుచ్చుకోవయ్యా! అన్నా

# దసరా సంచిక

## పిల్లలకు ప్రత్యేకాకర్షణ

## కథలు, గేయాలు, చిత్రాల రచనలో పోటీ

రాబోయే 'విజయదశమి' పండుగకు (1953 అక్టోబరు 17 వతేదీ) ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక పిల్లల ప్రత్యేక సంచికగా వెలువడుతుందని పాఠకులకు తెలుపడానికి ఆనందిస్తున్నాము. బాలబాలికలకు ఉల్లాసం, విజ్ఞానం కలిగించే చక్కని కథలు, గేయాలు, వ్యాసాలు, బొమ్మలతో పత్రిక ఆకర్షణీయంగా తయారవుతుంది.

బాల బాలికల రచనాశక్తిని, చిత్రలేఖనాసక్తిని ప్రోత్సహించడానికి గాను పోటీ పెడుతున్నాము. ఈ పోటీలో ఒక మంచికథకు, ఒక మంచిపాటకు, ఒక మంచిబొమ్మకు బహుమతులివ్వబడతాయి.

ఈ సందర్భంలో రచనలు, చిత్రాలు పంపదలిచేవారు ఈ క్రింది అంశాలను గుర్తుంచుకోవాలి.

* పదిహేనేళ్లలోపు బాల బాలికలు మాత్రమే ఈపోటీలో పాల్గొనవచ్చును.

* కథలు, గేయాలు, బొమ్మలు స్వతంత్రమైనవై ఉండాలి:

*, కథలు గేయాలు కాగితానికి ఒకేప్రక్క సిరాతో స్పష్టంగా వ్రాయాలి.

* బొమ్మలు రంగులలో కాని, రంగుకాగితం పైనకాని సిరాలతో వ్రాసినవిగాని పనికిరావు. ఇండియన్ ఇంక్‌తోగాని పెన్సిల్‌తోగాని వ్రాసిపంపాలి.

* రచనలు, బొమ్మలు 1953 సెప్టెంబరు 15 వ తేదీలోగా మాకు చేరేవిధంగా పంపాలి.

* రచయితలు చిత్రకారులు తమ పూర్తిపేరు (ఇంటిపేరు కూడా) వయస్సు, చిరునామా అన్నీ వివరంగా రచనలూ చిత్రాలతో పాటే వ్రాసి పంపాలి.

* స్వీకరించబడని రచనల్ని, బొమ్మల్ని తిప్పి పంపాలని కోరేవారు చాలినంత స్టాంపుకూడా చేర్చి పంపాలి.

* కవర్లపైనా లేక రేపర్లపైనా "ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక దసరా పోటీకోసం" అని స్పష్టంగా వ్రాసినవి మాత్రమే పోటీకి స్వీకరించబడతాయి.

## ★ కాలక్షేపం ★

యంగా ఒళ్ళు చెడగొట్టుకొని, ఇల్లా బజారుల వెంట తిరిగే బదులు-" అని సలహా యిచ్చారు.

సరే ఎందుకైనా మంచిదని ఆ పెద్దమనిషి తన స్నేహితుడైన ఒక డాక్టరువద్దకు వెళ్ళి తన ప్రస్తుత దేహస్థితి ఎల్లా ఉన్నదో ఒకసారి పరీక్షించి చూడు అన్నాడు. ఆ డాక్టరు మిత్రుడు వెంటనే అతని మూత్రం పరీక్షించి "మూత్రంలో చక్కెర ఎక్కువగా ఉందోయి నీకు. ముందుగానే వచ్చి నాకు చూపించడం, మందు పుచ్చుకోవడం ఎందుకైనా మంచిదని వచ్చావు - నిజమే. మధుమేహం చాలా చెడ్డది. ఒళ్లు గుల్ల చేస్తుంది. నీ ముఖ కవళికలోనే కన్పిస్తోంది నీ వ్యాధి లక్షణం. అడ్డమైన చిరుతిండ్లు, విరివిగా తినవద్దు. ధాతుశక్తి చెడినతర్వాత ధన్వంతరి వచ్చినా రక్షించలేడు" అని ఒక ఉపన్యాసం ఆ పెద్దమనిషికి గుండెలలో రాయి పడేటట్లుగా సాగించి, అయిదారు టానిక్కుల పేర్లు రాసి యిచ్చాడు. ఈరీతిగా ఈ డాక్టరు మిత్రుడు చెప్పినది మొదలుగా ఆ పెద్దమనిషి మిగుల దిగులు కొంది, నిద్ర సరిగ్గా పట్టక, ఆహారం సరిగ్గా రుచింపక, అవస్థ పడుతున్నాడు. అనవసరమైన ఆవేదనతో అతని జవసత్తువలు అవరోహణ క్రమంలోకి వచ్చాయి. అతని ఆరోగ్యం అమావాస్య పూర్వపు చంద్రుని వలె 15 రోజులలో బహువిధాలుగా మారుతూ బహుళపక్షంగా ప్రవర్తించింది. అతని స్నేహితులందరూ అతనిని పరామర్శ చేయడానికి అతని యింటికి వచ్చి, "ధైర్యంగా ఉండాలి! నీకేమీ భయం లేదు! ఋతువు బాగుపడగానే ఆరోగ్యం తిరిగి అదే వస్తుంది. టానిక్కులు పుచ్చుకుంటూ ఉండు. బాగా విశ్రాంతి పుచ్చుకొని యింట్లోనే ఉండు. ఇదివరకు అజాగ్రత్తగా నిర్లక్ష్యంగా విర్రవీగుతూ విచ్చలవిడిగా తిరగడంవల్ల ఎంత చిక్కిపోయినావో చూడు! వెనుకటి మనిషికీ యిప్పటి మనిషికీ ఏమైనా పోలిక ఉన్నదా?" అని ఆ పెద్దమనిషిముందు పిరికిమందులు నూరిపోయడం ప్రారంభించారు. ఆ పెద్దమనిషికి మిగిలిన డాక్టరు మిత్రులుకూడా ఇదేరాగం ఆలాపన చేశారు. ఈవిధమైన ముఖారి రాగం అతని మిత్రులందరూ అతని ముందర ముప్పొద్దుల ఆలాపన జేయుచుండుటవల్ల అతడు ఉత్సాహం పోయి నిరుత్సాహియై, ధైర్యం పోయి అధైర్యుడై, స్వస్థత పోయి అస్వస్థుడై, రోగంలేని రోగియై, ధారకం లేని నిరాధార స్థితిలోకి వచ్చాడు. గుండువంటి మనిషి బెండువలె ఎండిపోయినాడు. అప్పుడతని మిత్రులు తమకుట్రయొక్క ఫలిత ప్రభావానికి సంతోషించారు. అతని మామగారు యీవిషయం అంతా కూలంకషంగా అవగాహన చేసికొని, ఆ పెద్దమనిషిని ఆ ఊరి నుంచి తన యూరికి తీసికొని వెళ్ళి అక్కడఉండే డాక్టరులచేత బలం పట్టుటకు మందులిప్పించి, గ్రామంలోని బంధుమిత్రుల సన్నిహిత సాహచర్య సమాదరణోత్సాహ ప్రభావముల మూలమున అతని ఆరోగ్యం అదివరకుకంటె అనేక రెట్లు వృద్ధి అయ్యేటట్లుగా చేశాడు. "సంతోషం సగం బలం" అనే మాట నిజం. అంతే కాదు. "దుఃఖం సగం దుర్బలం" అనే మాట కూడా నిజమే.

అగ్నికణం ప్రజ్వరించాలి అంటే, విసనకర్రతో బాగా విసరాలి. ప్రతి మానవుని హృదయంలోనూ ధైర్యం అనేది ఉంది. తగిన సాధనసంపత్తి ఉంటే, తగిన సందర్భావకాశాలు ఉంటే, తాను ఇంకా యింతకు మరింత సామర్థ్యం చూపించగలననే ధైర్యం ఉంది. అయితే, చిట్టచివరి మెట్టువరకూ ఆ మాటమీద నిలువబడలేడు. సందర్భావకాశాలు తాను కోరిన ప్రకారంగా అనుకూలించలేదు గనుక, తనకు దైవం ప్రతికూలించాడు గనుక, తలచిన పని తలక్రిందులైనదని వాదిస్తాడు. నీటిలో దిగుతాడు. గట్టుమీద కూర్చుండి మెట్టమీద చెప్పిన వేదాంతం నీటిలో దిగిన తర్వాత అక్కరకు రాదు. ఇక ఏటికి ఎదురీతగా కన్పిస్తుంది. తన ప్రభావంకంటె ప్రవాహం ప్రబలంగా కన్పిస్తుంది. దైవం ప్రతికూలించాడని ఎంచి ధైర్యం చెడి, "నట్టనడి సంద్రాన నావలో ఉన్నాను"-అని గుండె కొట్టుకొని, మనిషి నిలువునా నీరైపోతాడు. వన్నెటి కొల్వలో జలకమాడిన పాదుషాకు కూడా, బాష్పప్రవాహము గట్టు తెగిన గోదావరిలాగున పొంగిపొరలి వస్తుంది. ఆ కన్నీరు మున్నీరుగా వచ్చి అందులో పడి కొట్టుకొనిపోతూ ఉంటాడు. "అల్లాహో! అక్బర్" అనే మాట ఆ సమయంలో ఆత్మశుద్ధిగా అంటాడు. సీమ వచ్చి మెరపకాయ కొరికితే, కళ్లవెంట నీళ్ళు వస్తాయి. కాని, అప్పుడు కూడా "అల్లాహో అక్బర్" అనే మాట అంతరాత్మలోనుంచి, కడుపు తరుగుకొని పోయినప్పుడు కడుపులోనుంచి వచ్చినట్లుగా రాదు. అల్లాహో అక్బర్ (భగవంతుడే సర్వశక్తిసంపన్నుడు) అనే మాట నాలుక చివరినుంచి కాకుండా నాభివద్దనుంచి ఎప్పుడైతే వచ్చిందో, అప్పుడే దాని శోభ. "రావె! ఈశ్వర కావవె వరద! సంరక్షించు భద్రాత్మకా!" అనే పద్యానికి సాటియైన గజఘీంకారము మరొకటి మానవభాషలో లేదు. అదే గజమొఱ. ఎటువంటి గజయీతగానికైనా అందని లోతు ఆ పద్యంలో ఉంది. అటువంటి గజమొఱ వినిపించినప్పుడే, వైకుంఠం మన వాకిట్లో విష్ణుపీఠంలాగున తయారవుతుంది-చక్రం గిర్రున తిరుగుతుంది.

ఇక భయం లేదు. కాని, ఒక్కసారిగా చక్రం తిరిగేటప్పుడు మనం గ్రుక్క తిప్పుకోలేక ఉక్కిరి బిక్కిరి అయిపోతాం. రష్యాలో విప్లవం వచ్చింది. అది ఒక గాలి తుపాను. అది ఒక అగ్నిపర్వత ప్రకోపం. అది ఒక బ్రహ్మాండమైన భూకంపం - అది ప్రపంచ ప్రకంపం. అది చండమార్తాండుని నిప్పులు చెరిగెడి నడివేసంగి ఎండ. అది ఉరుముల మెరుపుల పిడుగుల దండయాత్ర. అది అఖండ గోదావరీ జలప్రళయం. గట్లు తెగిపోయినాయి. జారు చక్రవర్తుల రాజవంశం నిర్వంశం అయింది. హఠాత్తుగా వచ్చింది విప్లవం అన్నారు.

కాని, అదే అజ్ఞానాంధకారం. మనం అంధకారంలో ఉన్నప్పుడే, అర్ధరాత్రివేళ ఆదిశక్తి ప్రత్యక్షమైనట్లుగా, కాళ్ళక్రిందకు నీళ్లు వస్తాయి. కంఠంలోతు నీరుకూడా మరి కొన్ని గంటలలోనే వస్తుంది. అటుతర్వాత కండ్లు విప్పి గండ్లు ఎక్కడో చూస్తాం. కాని, ఏంచేస్తాం? ఆ ప్రవాహానికి ఒక నమస్కారం చేస్తాం. ఇళ్లా వాకిళ్ళకు నీళ్లు వదులుకొని, "నా" అనేది "న" అని గ్రహించి, "నా" అనే దీర్ఘం తీయకుండా, తోక ముడతబెట్టి ఏ చెట్టుకొమ్మలకో చేరి ఆకొమ్మలలో తమ కొమ్మలతో కొమ్మళ్ళతో సహా ఎక్కి ఇక్కట్టు గట్టెక్కేవరకు అరచేతిలో ప్రాణాలు బిగబట్టి, రాజమహేంద్రవరం రాజవీధులలోనూ, అంతా భద్రమని భావించిన భద్రాద్రి ప్రాంతంలోనూ, నిన్న మొన్న జలవిలయంలో జనులు తహతహలాడినారా లేదా?

గోదావరీప్రవాహం అనేది బ్రహ్మాండమైన శక్తి. అది బ్రహ్మాండమైన శక్తి అని గ్రహించినంతమాత్రంచేత ఏమి ప్రయోజనం? - "దేవుడు అంటే ఎక్కడో లేడు. నీలోనే ఉన్నాడు" అని తత్వజ్ఞానులూ, తపస్సంపన్నులూ చెవినిల్లు కట్టుకొని చెప్పారు. "నీశక్తిని నీవు తెలుసుకో" అని ఘోషించారు ఋషులు. వేదాలు, నినాదాలు చేశాయి. అయితేమాత్రమేమి? మనశక్తి మనము తెలిసికొనకుండా నిద్రపోతున్నాము. మనము నిద్ర మేల్కొని మనలో ఉన్న శక్తిని మనము తెలిసికొనలేక పోయి

(54-వ పేజీ చూడండి)

# గోదావరి తల్లి కినుక

★



కొంపలుకూల్చిన కలప
(తుమ్మలాం-రాజమండ్రి)

ఆగస్టు 16 న క్షణ మొక యుగంగా గడిపిన రాజమండ్రి పౌరులు



ప్రభుత్వకార్యాలయాలు (రాజమండ్రి.)



ధనవంతుల మేడలు



పేదల కొంపలు



పంట చేలమీదుగా పడవల్లో ప్రయాణం (నర్సాపురం — పాలకొల్లు.)



విజ్జేశ్వరంవద్ద విజృంభించిన గోదావరి



జలమయమైన శివాలయం (కొవ్వూరు - గోష్పాదాల క్షేత్రం.)





1, 2, 3:- రామపాదాలను అందుకో నుత్సహించిన గోదావరి (భద్రాచలం.)



4. అమలాపురంలోని అగ్రహారం వీథి
5. తుఫానుకు తల్లకిందులైన కపిలేశ్వరపురం తోటలు.





# అవగాహమా? అనురాగమా?

ఆషాడమాసం ఆఖరుకు వచ్చేసే ఘడియలవి అవతలగోదావరి, అరవై అడుగులు వంతెనవద్ద చూపిస్తూ వుంది అసలు, ఆమె, గుడిసె గట్టుక్రింద ఆక్రమణస్థలంలో వేసికుంది కలగంటూమా యేమిటి అంత వరద ఒక్కసారిగా కొట్టుకొస్తుందని? తెల్లవారూ చూపొగ్గి చూస్తూమాస్తూ, మఱీ చూస్తే, తన్నే మునిగిపోయేటంత మోసం అగునేమో అని, మంచం కంచం, బట్టలని తెల్లారిఅంలో ఒడ్డుకు చేరేసి, గుడిసె ముందు తిన్నె, గుడిసిమీది కప్పు తిన్నగా ఏటనీటికి వదలేసి, ఒక్క నిట్టూర్పు విడిచింది ఆమె ఆ నిట్టూర్పుతోనే, గాలికి పడవ తిరిగినట్టు, పడమటనుంచి తూర్పుకు తిరిగింది ఎఱ్ఱగా బాలభానుడు తూర్పున పొడగలేదు ఊరుదారి ఒకటే వన్నెను హాజరవా తేలా

“ఈపొద్దు ఏంటిబాబూ!” అని అడిగింది ఓశాస్త్రి ఆలా నదీస్నానానికై నడచి పోతూవుంటే “ఈపొద్దు ఏ ప్రొద్దయినా, ఆషాఢమాసం ఇలాంటిది మఱి రాదు ఇంత చేటు కొత్త గోదావరి మఱి చూడబోము నీవొక్క మునకేస్తివా నేనొక్క మంత్రం చెబుతను ఉంటే ఒక కానీ ఇవ్వు, లేకుంటే అదే పోయిరి!” అన్నాడు శాస్త్రీజీ!

శాస్త్రీజీకి వయస్సు నలభైయో పడి అయినా, చమత్కారంగా మాట్లాడడంలో ముప్పైయోపడి అనవచ్చు! ఈమె వెంటనే అంది “తానాలకేమొచ్చె, మానాల మహా వరద” అని “మానేదేంటి వరదింక? ఈ వేళ ఆషాఢం వెడితే రేపు శ్రావణ మాసం ఆపైని భాద్రపదం విఘ్నేశ్వరుడి చవితికి వీధుల్లో తెప్పానాం తేలానాం!” అన్నాడు “అప్పుడు మీది మాది ఒకటే విగ్నానం అన్నిళ్లదీ ఒకటే స్నానం వేఱే నేనూ చేయనక్కఱలేదు తంవరూ చేయనక్కఱలేదు” అంది

గోదావరింకా పోటుమీదుంది దాపుగా ఏపుగా ఏతట్టు చూచినా క్రొంగ్రొత్తి రూపుతో వుంది కొండల్లోంచి ఏలా వాలుగొన్నదో, లంకల్లోంచి ఆలా జాఱిపోతూన్నట్టు తోస్తూవుంది కొంపలంటే వేఱే కొండలు కొనకు ఒక్కపాపి కొండల్ని తప్పిస్తే లంకలంటే ఇన్ని లంకలు లేవు ఒకటి రెండు మూడు బొబ్బరలంక, పిచుకల్లంక, మద్దూరులంకలయొక్క ఏక వరస లప్పిస్తే అత్తట్టు కొవ్వూరే వూగు ఈతట్టు రాజమహేంద్రవర మేపూరు మధ్యను పడవ లేదు నావలేదు రేవులేదు దెల్లులేదు గాలితో, గయ్యాళిగంపలా, అఖండ గౌతమి అంబుధి కేసిపరువుస్త్రొక్కుతూ వుంది

శాస్త్రి ఆ గంగవంక చూస్తూ నమస్కరిస్తూ “గోదావరీమాయీ! గంగామాతా!” అంటూ నీటలోకి దిగేకు ఈమె, ఈయిల్లాలు ఈడి ముంతబాడి ముంత సర్దుకుంటూ గట్టుపైనే గోళ్లు గిల్లికొంటూ

“అల్లంతలోపల
ఆషాఢమాసం
వెళ్ళిపోతే
తద్దిరాకుండునా?
గోళ్లకూ గోరింట
నే పెట్టనా?”

అని వెల్లికంటూ పూరుకుంది ప్రవాహం ఇంకా పైకెక్కుతూ వున్నటుంది తెట్టు, నురుగు, చితుకు చీమ అన్నీ కూడా నది యొక్క ఉద్ధృతాన్నే సూచిస్తూవున్నాయి కాని, ఏమాత్రం తీతను గనబఱచడం లేదు

బ్రాహ్మణుడు స్నానం చేసి, తిరుగి వస్తూ అన్నాడు “ఓ అమ్మీ! వరద గట్టును దొలిచేస్తూవుంది కిందనుంచి పడిపోగలవు” అని పడుచు అంది “బామ్మర్లకు మాంపడిపోవాలనే వుంటుంది పొద్దల్లా!” అని “మేమేం వలపన్నే పల్లెవాళ్లం గానీకాం” అన్నాడు శాస్త్రీజీ. “కాకపోవడమేటి ఆళ్ల జండెం మీజండెం ఒకటే” అంది శాస్త్రికి ఆమాటలో తన ధాటీ కొంత తగ్గించేమనిషి అదొక్కర్తే అని తెలుసుకొన్నవాడై, “అష్టైతే! ఆమంత్రం చెబుతా వినుకో! కొత్త నీటికి చేపెదురీత్తోంది” అన్నాడు. “ఏకాడ?” అంది “ఏకాడేంటి? పట్నంలోని మురుగు కాలవలన్నింటికాడ” అన్నాడు “అయితే ఏరూ ఊరూ ఒకలాగే వున్నాయి” అంటూ బ్రాహ్మణుని వెనకాలే వెళ్ళింది ఆబిత్తరి

దాంధ్రి అసలు పాలెం ఆ సంగతైనా అది చెబితేనే చెవికెక్కుతుంది మఱే పాలెం అంటే ‘గొల్లపాలెం” అనిగాని “జువ్వలపాలెం” అని గాని ఏదీ చెప్పలేదు దానికో యిరవై అయిదేళ్లుంటాయి ఇల్లుంపడం చేత ఇల్లాలు అని అనుకోవలసిందే కాని పెళ్ళి ఏనాడైందో? పెనిమిటిని ఎడిచిపెట్టిన ఎరువుమనిషిలాగే కాపడ్డది అల్లుడే మల్లుడు, మల్లుడే అల్లుడు ఆ ఆడ మనిషికి అధికారినీ ఓలాగే చూస్తుంది, అనధికారినీ ఓలాగే మాస్తుంది అమృత్తి కాశిని చెట్టుక్రింద కాఫీ అమ్మే జగన్మోహినికంటె జవరాలిలా ప్రవర్తిస్తుంది నన్ను ముటుకోకన్నట్టు కుట్టెల చప్పుడు చేసుకుంటూ గబగబా నడచిపోయే సినీమా ప్రేక్షకురాలికంటె నవనాగరీకంగా నర్తిస్తుంది

“బాపనయ్యా! నిజం సెబుద్రూ! ఈపొద్దుతో ఆషాఢమాసం సరా?” అని అడిగింది శాస్త్రీజీ ఆ ప్రశ్నకు జవాబు చెప్పకుండానే ప్రక్కసందులోకి నిష్క్రమించేడు ఆపిల్ల ఒక్కర్తి నాలుగురోడ్ల కూడలివద్ద నిలుచుండి పోయింది ఊళ్లోనూ అంతా నీరుగానే వుంది గోదావరి ఊటచే కొంత, అప్పటికోవారంనుంచి కురిసే వానల జోరుచే కొంత, అసలు ఋతుపవనం “బద్దలు” కావడంలో వుండే వింత కొంత - ఏలా వుండాలో ఆలా వుంది పట్నమంతా ఎటొచ్చీ పట్నంలో మేలిళ్ళున్నాయి రోడ్లున్నాయి దళ్ళ మళ్ళ పడేపోనాయి పందిళ్ళూ పాకలూ అంతే!

ఒక్క పురపాలక సంఘంవా రేర్పాటుగావించిన ఉద్యానవనాల గోడలు, గోడల్లో తిన్నెలుమాత్ర మేల్గాగుండవలసిన

# ★ అవగాహమా? అనురాగమా? ★

వాలాగున్నాయి ఆ ఉద్యాన వనాలు మాత్రం చూడ సొంపుగా, పచ్చగా పచ్చిక మొలిచి కొత్తగా పూలు పూసి నవ్యత సూచిస్తూ వున్నాయి

ఒక్కచోట! కొండతంగేడు – ఊళ్లోనా అన్నట్టు – పైకి పెద్దగా నిలువెత్తు పెఱిగి, వలంగా కొమ్మలుసాచి, రొట్టబోసి, చివళ్లను పసుపుపచ్చగా బూసి గాలికొడుతూ వుంది. దానినే సుకుంటూ దరిదాపులోనే ఒక గోరింటదుబ్బల ఆకూముల్లూ బలిసి వంకుంటే వయ్యారిదన్నట్టు కనిపిస్తూవుంది మఱి నేలమీద మిగతాదంతా పచ్చికే! ఇంకా పొదులు పెట్టలేదు. దొంగవిత్తులన్నీ తొలకరికి ఒయలుబడ్డాయి అన్నట్టుంది ఆ ఆర్ద్రిత ఆ హార్ద్రత గోడలు చుట్టూ వుండడంచేత గొడ్లు పడడంలేదు లేకుంటే ఆ ఘడియకెన్ని ఆంబోతులు, ఆవులు, బఱ్ఱెలు, లేగలు ఆ ఉద్యానంలో వుండేవో!

ఇది, ఈ పడుచుపిల్ల, మానిసికాబట్టి తలుపు ముంగుద్రోసి, అది తాళంవేసి వుండడం కనిపెట్టి, చీర పైకెగ్గట్టి గోడ దూకి లోపలికి దిగింది ఆలోచన అతి సాహసం రెండూ కలిసి ఆమెచేత ఆపని చేయించాయి చీర, తెల్లనిచీర రయిక నల్లని రయిక, వొళ్లు, కనబడేచోటల్లా తప్త కాంచనం తైల సంస్కార మంతగా లేక నిగనిగ తక్కువైనా తలకట్టు చీకటి ముల్లెలా కనిపిస్తూవుంది వెనకనున్న కొండతంగేడు పువ్వూ చెట్టూ అంతా ఆమె నిలుచున్నప్పుడు తలమీద ఆనినా ఆమె దాన్ని తొలగించుకోవడం మఱచి, ఎదటనున్న గోరింట పొదమీదకు వొఱిగి గోరింటాకు ఊ – కోసేస్తూ వుంది మేక కనుక మేస్తూ వుంటే, ముళ్లు వాటంత టవితప్పి, ఆకూడి పడ్డట్టు, ఆ ఎమ్మెలాడి గుప్పిల్లోకి ఈ గోరింటాకు గ్రుచ్చుకోకుండా కూర్చుకుంటూ పడింది ఆ యిల్లాలు ఎగ్గట్టిన చీర దిగజార్చి, ఒడిగా మార్చి, ఆ ఒడినే అంతల్లా ఇంత చేసి, ఇంతల్లా అంతచేసి, అందులోకి ఈ గోరింటాకు చేర్చదొడగింది పైని కొండతంగేడు ఆ బొమ్మక్క నిలుచున్నప్పుడల్లా ఒక్కసారి దాని సిగ నలంకరించి యూగిసలాడేది వంగున్నప్పుడు "వన్నమాల్నంత పట్టుకెళ్లు తల్లి!" అన్నట్టు గోరింట ఆహ్వానించేది ఎండ కొంచెం తెల్లబాఱి వెచ్చనెక్కి, పచ్చికమీదను తడివొత్తేలా పఱచబడివుంది మిగతా లోకంఅంతా తెగతెంపులేని తేమతో, వామనంతో చికాకుగా వుంది

శాస్త్రి ఇంటికివెళ్లి జందెంమీద జందెంలా ఒక తెల్లని అంచులకండువా తీర్చి దిద్దుకు వేసుకు, మాయాప్రవరుడా అన్నట్టు తానై ఆ యుద్యానవన ప్రాంతాన్ని నడుస్తూ "అమ్మా! బండలదొడ్డిలో పడగలవు" అన్నాడు అమ్మ అటు తిరిగి చూస్తూ "నేనేం పశువునా?" అంది "పశువువు కాకుంటే పాము రాంగనవు" అన్నాడు

అనడంలో గోదావరి గట్టుంకి చూచాడు. ప్రజ కోలాహలంగా నిలబడివున్నారు. గట్టు – మఱి అంగుళం నీరొస్తే తెగిపోతుందనే ఆదుర్దాలోవున్నారు ఎవళ్ల సామాను వాళ్లు నెత్తినెట్టుకుంటూ, "ఒత్తిగిలండి ఒత్తిగిలండి, ఇక్కడేం వింతమాచేరు గండి పడిందా మీరు మేము నీరు అంతా ఏకమే! మీసామాను మీ సంసారం చూచుకోండి!" అని హెచ్చరిస్తూ వున్నారు.

"అమ్మా! మీగట్టు ఊలగొడుతూ వున్నట్టుంది వింటున్నావా?" అన్నాడు బ్రాహ్మణుండు. "ఎంత సిల్లడవుంటుంది?" అంది గోడెక్కి దారికురుకుతూ – బ్రాహ్మణుడు "నీవు కోసిన గోరింటాకు ముద్దగా నూరి మెత్తితే సరిపోద్ది" అన్నాడు ఎటకారంగా కాని ఆ స్త్రీకి ఆ ఆపత్సమయములో పై ఎటకారపు మాటే నిజంగా తోచి, పరుగు పరుగున ప్రజను తప్పుకోమంటూ, తన సన్నికలు తన రాయినీట తేలకుండా వుండిపోవడం, స్థావరత్వానికి చిహ్నంగా చేకొని, అందుమీద తాను తెచ్చిన గోరింటాకు పచ్చిది పడేసింది, "తల్లి! తానే నూరుకోంటుంది!" అంటూ, నిరాశ చూపులు చూచింది

గోదావరి కెరటం దానంతటదే పాత్రాన్ని ముందుకు కదిపింది ముద్దగా ఆకు నూరింది

ఈ అంగనామణి ఆపాళంగా ఆ అయిన గోరింటాకు ముద్ద ముద్దా ఊలగొట్టె రంధ్రంలోకి చొప్పించి

"ఆషాఢ మాసంబు
ఆఖరువు కాకుండ
గోదారి తల్లీకి
గోరింట పట్టిస్తి!"

అంటూ పాడింది

బ్రాహ్మణుడా వెనకాలే నిలుచుండి "నీ గోళ్ళు చూచుకో" అన్నాడు ఆమె చేతివ్రేళ్లు గోరింట ముద్ద మెత్తడంవల్లా, కాలివ్రేళ్లు మెత్తినచోట దిగబడ్డంవల్ల ఎఱ్ఱగా పండివున్నాయి

"ఆషాఢ మాసంబు –
ఆఖరువు కాకుండ
అదికూడ సమకూరె!
మదిరాక్షీ! నీకిపుడు"

అన్నాడు బ్రాహ్మణ శ్రేషుడు.

"అది" అంటే "అవగాహమా? అనురాగమా!" అని ఎందఱో వ్యాఖ్యానించేరుగాని నిజంగా బ్రాహ్మణునకు ఆ అమ్మవల్ల తుదకు ముట్టింది ఒక డబ్బు అదితే లోకానికి తట్టింది పెద్ద ఎఱ్ఱనిమబ్బు! సూర్యుడు సిబ్బరేకంతై ఎఱ్ఱగా క్రుంకిపోతూ ప్రవాహంమీద పరిఘ విల్లజేసేడు. ★

# సత్యాం పెళ్ళి

రెండుపక్షులు జంటగా వ్యోమపథంలో విహరిస్తున్నాయి. రెండు కుక్కలు వీధిలో ఆడుకుంటున్నాయి.

'ఋతుప్రభావం' అన్నాడీ ప్రకృతి ధర్మాన్ని నిర్లిప్తంగా తిలకిస్తూ, మేడమీద కూర్చున్న రిటైరు కాని ప్రైవేటు కంపెనీ వుద్యోగి.

'మోటుమాటలు' - సిగ్గుతో పయ్యెద సవరించుకున్నది, ఆయన సతీమణి. ఆమె మెడలో క్రొత్తగా కట్టుకున్న పసుపు త్రాడు, ఒక పేట బంగారపు గొలుసు సహావాసాన మెరసిపోతున్నది. నుదుట తీర్చిన కుంకుమబొట్టు, నెరుస్తున్న జుట్టు ఈ సంరంభరహిత సౌందర్యాన్ని మూడు దశాబ్దాలుగా అనుభవించి అలసట జెందకపోయినా, అలవాటువల్ల చలించని నేత్రాలు రోడ్డుమీదికి దృష్టిసారించినయి. పక్షులు దృష్టిపథాన్ని దాటినయి. కుక్కలింకా హుషారుగా ఆడుకుంటున్నయి.

పెద్ద మనుమడాడుకుంటున్నాడు వీధిలో. ఒక ఆబోతు వడివడిగా వస్తోంది. 'అయ్యో, రాముడూ' అంటూ క్రిందికి పరుగెత్తింది. ఆమె క్రిందికి వెళ్ళేసరికి తల్లి వచ్చి రాముడిని తీసింది. ఈ హడావిడి చూచి రెండేళ్ళ రాముడు ఏడుపు ప్రారంభించాడు. సరోజిని చేతిలోనుండి పిల్లవాణ్ణి తీసుకుంటూ, 'ఎక్కడికెళ్ళావ'ని ప్రశ్నిస్తే, అమృతాంజనంకోసం ప్రక్కింటి కెళ్ళానన్నది కోడలు.

రాముణ్ణి పైకి తీసుకువచ్చింది. వాడు ఏడుస్తూ తాత దగ్గరకు చేరాడు. ఆయన ఆప్యాయంగా తలనిమిరి, కళ్ళు తుడిచి, ఆంబోతును చూపించేసరికి వెంటనే నవ్వేశాడువాడు.

'ఈకాలపు వాళ్ళు మరీ అన్యాయం. పిల్లలైనా చూసుకోటం చేతకాదు.' ఆవిడ అన్న ఈరెండుమాటలకీ ఆవిడ వంక చూడకుండా, సమాధానంగా చిరునవ్వు నవ్వాడు.

'ఒక్క పిల్లకే యిలా పిచయితే ఎలా'- ముప్పది ఏండ్లనాటి, తన ప్రథమ మాతృత్వం ఆమెకు తరచు గుర్తుకు వస్తుంటుంది. పెళ్లినాటికి 12 ఏళ్లు. కాపురానికి వచ్చేసరికి 14 ఏళ్లు. కడుపు త్వరగా ఫలించింది. అత్తింటివారు, పుట్టింటివారు కలిసి సంతోషంగా నూక్తులు, నూడిదలు, సంబరాలతో ఈ సహజమాతృత్వాని కామెను సిద్ధపరిచారు. ప్రపంచంలోకి వచ్చిన పదునాలుగేళ్లలోనే ఆమె సరసిజభవుని సృష్టిక్రమానికి సాయపడగలిగి, సార్థక్యతను సాధించగలిగింది. కాని ఆమాతృత్వం మీద మహేశుడు మూడవ నేత్రం త్వరలో తెరిచాడు. ఎదురుమాడని ఈ ఆర్తికి అంతా సానుభూతి చూపారు. వెంటాడుతున్న వేదనతోనే ఆ కీరవాణి పుష్పసాయకుని క్రీడామృగమై, కాలాన్ని వెనకేసి రెండు సంవత్సరాల్లో తిరిగి, తీరని ముకువులు తనువెల్ల పులకలు నింప, మాతృత్వాన్ని స్వీకరించింది. చీకటి గదిలో చెలువుడితో ఏమి చెప్పుకున్నదో, బయాటి ప్రపంచానికి తెలియదుగాని, అందరితో పాటు ఆమెకూడ మురిసిపోయింది. నాటి

శ్రీ [illegible]

నుండి నేటివరకు మాతృత్వమే ఆమె జీవిత ప్రణాళికగా ఎంచి అమలుపరిచింది. ఒడుదుడుకులు, జననమరణాల మధ్య సంభ్రమ సంతోషాలు ముప్పిరిగొన్నయి. నేటికి హాయిగా, తేలికగా సృష్టికారుని ఆజ్ఞలను మన్నించకుండా బ్రతకగలిగిన అవకాశం కలిగినప్పుడు, వలరాజు ఆమెను తిరస్కరించాడు. భర్త సాయంతో భవుని పదాల నర్చింప నిశ్చయించి, బాధ్యతలన్నీ తీర్చి, బంధనాలన్నీ త్రెంచుకోటానికి ప్రయత్నిస్తున్నది.

సంపూర్ణ సహకార మిస్తున్నాడు నాథుడు. ఇప్పు డాయన స్థితిలోవున్న వారికంటె ఆయనకు సంపాదన కవకాశాలు తక్కువ లభించినయి. అయినా తుఫానులకు తట్టుకుని, సుడిగాలులకు సుక్కిపోక, వరదలకు వీగిపోక, మంచివాడని మెప్పించగలిగాడు. ఆ సతీపతు లిద్దరికీ హృదయాలు రెండు. వేదన ఒకటి—మనసులు రెండు, మాట ఒకటి.

పిల్లలందరూ నిద్రపోయిన తరువాత మన్మథకుమారుని మధురవనంలో చేతులు కలిపి విహరిస్తూ, మోవి తెరచి కలహించేవారు. క్రీడాభిరామంలో కలహాకేళీవిలాసం—రాత్రి రెండవ యామానికి అంతా సర్దుకునేది.

ఇన్నేళ్ళతరువాత, గడచినజీవిత మంతా ఒక మధుర భావన.

'వాళ్ళ బుచ్చికి పెళ్ళట' - ఆవిడ అన్నది - ఆవిడ పేరు కాంతమ్మ.

'ఎప్పుడూ?'

'వచ్చే త్రయోదశినాడు'

'కట్న కానుక లేమాత్రం.'

'వాళ్ళు చెప్తారూ - ఆ బసవమ్మ కెంత గర్వం—'

'నీకు తెలియకుండా వున్నదా' చిరునవ్వు నవ్వాడు. ఆ సుపరిచిత చిరుహాసం, వారి సుదీర్ఘ సహచర్యపు మమతలను మరింత కుదించి, చక్కలిగింతలు పెట్టింది. సన్నిహిత భావంతో, దాంపత్య సత్యాన్ని, తన విశ్వాసార్హ గుణానికి గర్విస్తూ, వెల్లడి చేసింది.

'చెప్పకపోతేమాత్రం దాగుతుందా, రెండువేలు కట్నం, ఎకరం పొలం పిల్లపేర వ్రాసేటట్లు; తక్కిన లాంఛనాలన్నీ జరిపి ఒకరోజు పెళ్ళి చేసేటట్లు'—

క్రింద బండి వచ్చి ఆగింది.

'పెళ్ళివారొచ్చారల్లే వుంది.'

'కాదులే మన పురోహితుడు కృష్ణయ్యగారు.'

'రండి' అని పైనుండే ఆహ్వానించాడు. ఆయన వచ్చి 'పెళ్లివారు మీతో మాట్లాడటానికి వస్తున్నామని చెప్పమన్నారు. ఇప్పుడు కొంచం పనివున్నది. అందుకని ఒక అరగంటతాలి వస్తారు' అని చెప్పి వెళ్లిపోయాడు.

'వాళ్ళకేమని వ్రాశారేమిటి' కాంతమ్మగారడిగింది.

'ఏముంది. మామూలుగానే, ఇప్పట్లో పిల్లవాడికి వివాహం చేయాలన్న అభిప్రాయం లేదని.'

'అయినా ఏదో మళ్ళీ చూచిపోదామని కాబోలు. క్రిందికెళ్దాం. వాళ్లు వచ్చేటప్పటికి యిళ్ళన్నీ ఎలా వున్నవో చూపిద్దాం'

తమతో వియ్యమంద నుత్సహించేవారు గుణసంపత్తిలో గణనీయంగా వుండటం సహజమని ఆమె మనసు చెప్పింది. తమ

తాహతును గుర్తించి గౌరవించగలిగిన ఆ వరాన్వేషకులను రహస్యంగా తన మనస్సులో నుతించింది. తాహతుకు మించిన తమ సంపదను తమ సంబంధంకోరి వచ్చిన పరాయి మనుష్యుల కళ్ళకు కట్టేటట్లుగా, తిరిగి మరపు రానట్లుగా మనసుపై ముద్ర వేయటం విధిగా ఎంచి, పసిడి వస్తుసముదాయానికి చెరవదిలించి తన శరీరాన్నలంకరింప జేసింది. వజ్రపుపాడివేసిన దుద్దులు, వడ్డాణం, 8 పేటల చంద్రహారం, కాసులపేరు వీటి ఉద్దామ సంపదలో పసుపుతాడు పత్తా లేకుండా మరుగున పడిపోయింది.

సరోజినిని పిలిచి సింగారించుకోమన్నది. ఆ అమ్మాయి తలనొప్పితో తలకు పట్టీలు వేసుకుంటున్నది. ఇంతలో ఈ అవాంతరం వచ్చింది. 'ఒక్క అరగంటసేపేలే. పోనీ వస్తువులన్నీ పెట్టుకుని, పట్టుచీరె కట్టుకుని పడుకో.' అనుజ్ఞప్రకారం తన పెళ్లినాడు తలితండ్రు లిచ్చిన వస్తుసమూహాన్ని ఒంటిమీదికి చేర్చింది. బనారసు పట్టుచీరె కట్టుకుని, తలకాయకు పట్టీ వేసుకుని హాలు ప్రక్క గదిలో పడుకున్నది. రాముడికి ముఖమల్ లాగు, సిల్కు చొక్కా.

ఇల్లు, యింట్లో వున్న మనుష్యులు త్రుటికాలంలో సంపత్సమాహితులైనారు.

యజమానిమాత్రం 'మీరుగూడ చక్కని సిల్కు ధోవతి కట్టుకోండి' అన్న సతీమణి సలహాను పరిణత హృదయంలో, వైరాగ్య తత్త్వంతో త్రోసిపుచ్చాడు. తన జీవితకాలపు ఆశాసహితయత్నాల ఫలితమీ కుందన రూపంలో ఒక్కసారిగా సాక్షాత్కరించేసరికి, సంతృప్తి తరంగాలు హృదయ సరోవరంలో లేచి సార్థక్యభావనా మేదుర స్వాంతుడైనాడు.

పెద్దకొడుకు ఆఫీసునుండి రాగానే తల్లి పెళ్ళివారి సంగతి చెప్పింది. మంచిదుస్తులు ధరించి సమాలోచనల్లో పాల్గొనమన్నది. ఆ సలహాను సక్రోధంగా త్రోసిపుచ్చాడా కఱకు కుర్రాడు.

'పెడసరపు బుద్ధి ఆనవాయితేగా — తండ్రికితగ్గ కొడుకే' అనుకుని సమాధానపరచుకున్నది.

వియ్యాలవారొచ్చారు. ఆడవాళ్ళు లోపలికివెళ్ళి యిళ్ళూ, ఒళ్ళూ అంతా పరిశీలించారు. ఆవిడ 8 పేటల గొలుసును ప్రశంసించారు. రవ్వల దుద్దులను మెచ్చుకున్నారు. రెండవ సంతానానికి తయారుగా వున్న కోడలి కడుపును దీవిస్తూ అత్తగారి సౌమనస్యాన్ని సన్మానించారు. కాఫీ ఫలహారాదులు సేవించారు.

మగవారికి కాంతమ్మ భర్త మర్యాదగా చెప్పాడు 'పిల్లవాడు పెళ్ళి వద్దంటున్నాడ'ని.

'మీ ఆజ్ఞని మీపిల్లలు మీరరని లోక ప్రతీతి.' ఈ అపరిచితుల నిష్కళంక స్తుతి తీయగా ఆయన నాడుల్లో తిరిగింది.

'మీకు లాంఛనాల్లోనూ, కట్న కానుకల్లోనూ ఏమీ లోటురానివ్వం'

'అబ్బే, పిల్లవాడిని చూడరూ. వాడెక్కడికో వెళ్ళినట్లున్నాడు.'

'వాడిని చూచేదేముందయ్యా' అన్నాడు పరమహితుడు ముత్యాల మాటల పురుషోత్తం.

వాళ్ళు వెళ్ళిన తరువాత. ఆయనన్నాడు ఆమెతో.

'వాడి కింకా 18 నిండలేదు. అప్పుడే పెళ్ళేమిటి.'

'ఇప్పుడు కాక యింకెప్పుడు. మరీ విచిత్రం — పెళ్ళికూతురు పెళ్ళికొడుకు ముచ్చటగా వుంటారు. ఈరోజుల్లో పెళ్ళిళ్లు చూస్తే నా కసహ్యం. ఎద్దులల్లే పల్లకీవాళ్లు మొయ్యలేక.' ఆమెను రెచ్చగొట్ట గలిగినందు కాయన సంతోషించాడు.

చెడుగుడాడుకుని కాబోయే పెళ్ళికొడుకు సత్యం యింటికి వచ్చేసరికి రాత్రి ఎనిమిది గంటలయింది. ఈలోగా పెళ్ళివారు వెళ్ళిపోయారు. ఆరోజు సత్యం ఎదురుచూస్తున్న చివాట్లు తగల్లేదు. తల్లి సంతోషంగా అన్నం పెట్టింది. యిల్లంతా కళకళలాడింది. వదినమాత్రం, గర్భభారం అప్పుడప్పుడు కలిగించే ఈ దురంతమైన శిరోభారానికి వీగిపోయి సామాన్లగదిలో పడుకుని వున్నది.

**21** ఏండ్ల సుందరం తన రెండేండ్ల కుర్రాణ్ణి పొట్టమీద పెట్టుకుని సుఖనిద్రపోయాడు.

మరునాటి ప్రొద్దుటికూడ సరోజిని తలనొప్పి తగ్గలేదు. రాత్రి భర్తవచ్చేసరికి నిద్రపోతూవుండటంవల్ల ఆయనకేం కోపం వచ్చిందోనని భయపడుతూ లేచింది. ఆమె లేచేటప్పటికే సుందరానికి మెలకువ వచ్చింది. కాని పక్కమీద పడుకుని సిగరెట్టు దమ్ము పీలుస్తున్నాడు. సరోజిని ముఖం కడుక్కోటానికి నీళ్ళిచ్చింది. దంతధావనానికి లేచి వెళ్లాడు. రాముడప్పుడే నిద్రలేచి ఎవ్వరూ తనని ఆహ్వానించి, బుజ్జగించేవారు లేనందున నోరంతా విప్పి, శక్తినంతా సమకూర్చుకుని, మంచంమీద కూర్చుని సావకాశంగా రాగాలాపన చేయడం మొదలెట్టాడు. తల్లికి వినపడ్డదో, వినపడి, వాడంతట వాడే వూరుకుంటాడులే అనుకున్నదో, వచ్చి సముదాయించటం మాత్రం చేయలేదు.

తాతగారొచ్చి బుజ్జగించి ఓదార్చారు. వాడి ధర్మమా అని మానేశాడు ఏడుపు. పనిచేసే మంగి మంచాన్నలాగే వుంచి కళ్లాపిజల్లి వెళ్ళిపోయింది. కాంతమ్మగారికి పెద్ద అనుమానం వేసింది. భయం పెనగొన్నది. 'శుక్రవారపూట యింతప్రొద్దెక్కేవరకు పాచి పక్కలేమిటి' అని పక్క ఎత్తేసి మంచం ప్రక్కగా పెట్టింది.

ముఖం కడుక్కున్న సుందరం మాటలన్నీ వింటూ కాఫీకి తయారుగా కూర్చున్నాడు.

'వస్తున్నా, నాయనా, కాఫీ కాచి యిస్తా'నని లోపలికి పోతూంటే వూరుకున్న రాముడు, తిరిగి ఎందుకో ఏడుపు లంకించుకున్నాడు. 'ఏమిటిరా నాన్నా ప్రొద్దున్నే ఎందుకురా, కాఫీకాయద్దూ ఎన్నిటికని చచ్చేది. అంటూ విసుగ్గా చంక వేసుకుని వెడుతూంటే సుందరం మనస్సులో తల్లిప్రేమ, భార్యమీద జ్వాలలు రగిల్చింది.

రాముడు నాయనమ్మ ఓదార్పుకు సంతసించక, వాడి ఏడుపును వదల్లేదు. చీకాకుగా సుందరం లోపలికి వెళ్లిన రెండునిము

పాలకు పెద్దగా కేకలు వినిపించినయి. సుందరం తన అధికారాల్లో కొన్నిటిని తన భార్యమీద ప్రయోగిస్తున్నాడు. ఆమె చెంపలు వాచిపోతున్నయి.

'కడుపులో వున్న దాన్ని కాలితో తన్నాడురా' అంటోంది తల్లి. ఎవరిని కొప్పడాలో తెలియక తండ్రి వూరుకున్నాడు.

తన చేతుల్లో సత్తువతగ్గి ఒక సిగరెట్టు కాల్చాలనిపించేదాకా కొట్టాడు సుందరం.

'ఏమిట్రా అలా కొట్టుకోటం, గొడ్డను బాదినట్లు' తల్లి మాటలు పాటించాలనిపించకపోగా, యిన్నేళ్ళుగా అణగిన వేదన తన్నుకొచ్చింది.

'నా యిష్టం. పెళ్ళి చేసి బాధ్యత వదిలించుకున్నావుగా యింక నీకు సంబంధం లేదు దీంట్లో' అని సరోజినిని సూటితాపులు నాలుగు తన్ని వెళ్ళిపోయాడు.

'పెళ్లి చేసుకుంటే నీకే గాని నాకేం ఒరిగింది' అని న్యూనపడి వెళ్లిపోయింది తల్లి.

ఆ వేళ ఆఫీసునుండి బయటపడేటప్పటికి ఆలస్యమయింది. సెగలు రగిలిన మనస్సును శమింపజేయటానికి ధూమపానం చేస్తూ, దిశ లేకుండా నడుస్తూంటే, పార్కు దగ్గర తటస్థపడ్డాడు చిన్ననాటి స్నేహితుడు, సహాధ్యాయి సుదర్శనం. ఐశ్వర్యం ముందుకు త్రోయనీ, అభిలాష అడుగు వేయించనీ అదృష్టం మంచి త్రోవ చూపనీ, ఎలాగయితేనేం, సుదర్శనం చదువులో పైకొచ్చాడు. ఇంజనీరింగు చదువుతున్నాడు. పెళ్ళి కాలేదు. దానివల్ల ఆ జీవితంలో సుందరానికున్న అనుభవం లేదు. కాని అనుభవాన్ని మించిన ఆసక్తి వుంది ప్రణయ జీవితంలో. అందుకనే అతడి అనుభవం బ్రహ్మచారులకు సహజమైన స్వప్నసుందరీ సాంగత్య విలాసమే.

'పెళ్లెప్పుడురా—' అడిగాడు మాటల సందర్భంలో సుందరం.

'నీవు చేసుకున్నావు చాలదూ. అంతా సెటిల్ అయి మంచి వుద్యోగం వచ్చిన తరువాత......'

'ఒక రంభనో, కుబేరుడి కూతుర్నో వరించి ప్రణయవిహారం చేస్తానంటావ్.' సుదర్శనం సిగ్గుతో విరగబడి నవ్వుతూ వీపు మీద చరిచాడు.

'నీవు తప్పు చేశావురా—పెళ్లి చేసుకోకుండా, ఉద్యోగం చేసి డబ్బు సంపాదించి తిరిగి చదువుకోవలసింది......' సుదర్శనం తేలికగా విడమర్చిన సుందరం చదువు సమస్య, ఒకప్పుడు సుందరానికి ఎంతో బాధ కలిగించింది. అందుకనే యిప్పుడు ఆశలున్న మెదడులో అగ్ని పర్వతాన్ని సృష్టించింది. తండ్రి యస్. యస్. యల్. సి. కి పైన చెప్పించలేనన్నాడు. కాని తనను సామాన్య సహజ సాంసారిక జీవితానికి తయారుజేయటానికి వలసిన ప్రథమ వస్తువైన భార్యను సమకూర్చాడు. ఆ బంధం నిర్బంధమై, నేడు చేస్తున్న వుద్యోగంలో అతన్నిరికించింది.

గతజీవితంలో జరిగిన తప్పును సరిదిద్దుకోటానికి సమయం దాటింది. కాని మనసు మాత్రం పరిస్థితితో రాజీపడలేదు. సుదర్శనం లాంటి స్నేహితులు తటస్థించినప్పుడు, స్రుక్కిన మనస్సు సుడిగాలిలా పైకి లేస్తుంది.

ఆరోజు అన్నం ముందు అతడేమీ మాట్లాడలేదు. అమ్మ తనకూ నాన్నకూ వడ్డిస్తున్నది.

'నీకోసం వచ్చి వెళ్లాడురా. సుదర్శనం' అన్నది అమ్మ. జవాబు చెప్పలేదు. నోరు విప్పితే ఎక్కడ అగ్ని పర్వతం బ్రద్దలవుతుందోనని భయపడ్డాడు.

# ★ సత్యం పెళ్ళి ★

'ఇంజనీరింగు చదువుతున్నాడు కదూ - మంచి వుద్యోగ మవుతుందిట జవాన్లూ వాళ్లూ వుంటారు హోదాగల వుద్యోగం - ఆతల్లి తన సౌభాగ్యానికి చింతిస్తున్నదో, వాళ్ళ అదృష్టాన్ని మెచ్చుకుంటున్నదో - పండిన మనస్సుతో తండ్రి చిరునవ్వు నవ్వాడు పొంగుతున్న వుద్రేకంతో పుత్రుడు ఛీత్కారం చేశాడు

సుందరం మనస్సులో ఈ గ్లానభావం మెదుల్తూనే వున్నది

రెండురోజుల తరువాత తల్లి సత్యం పెళ్ళిమాట తిరిగి హెచ్చరించింది

'ఏరా మీనాన్న నీవు వెళ్ళి పిల్లను చూచిరాకూడదూ—

'ఈసారి నాదగ్గర ఈమాట ఎత్తావంటే పూరుకోను చేసుకున్నవాళ్లు అనుభవిస్తున్నారు చాలదూ—ఒకటే పెళ్ళి పెళ్ళి అని గోలపెట్టకపోతే-'

'ఏం నాయనా పెళ్ళి చేసుకోమంటున్నా గాని వురిపెట్టుకోమంటం లేదుగా'

'వురిపెటి యింకా పెట్టుకోమనటం దేనికి'

'చక్కగా పిల్లలు, ముచ్చటగా కాపురం నీకేం - అయ్యో యింకా పూజించే భర్త నవుతే నిలవనే లేవు—

'చాల్లే-' అని విసురుగా లేచిపోయాడు

ఆవిడ మాత్రం ఈ చిన్న తుఫానుకు బెదరలేదు మన్మథుడి ప్రభావంలో నమ్మక ముంచింది కార్యాన్ని భర్తద్వారా సాధింపనెంచింది ఆయన వెళ్ళి పిల్లను చూసివచ్చాడు

పెళ్ళికొడుకు సత్యానికి సమస్యలేవు తింటున్నాడు చదువుకుంటున్నాడు - తిరుగుతున్నాడు అతని వివాహం అన్నకు సమస్య అయింది తనకు జీవితంలో అనుక్షణం కలుగుతున్న అపజయాలు తమ్ముడికి కలగకూడదని ఆవేదన కాని అనుభవంగల తల్లిదండ్రులు విచిత్రంగా ప్రవర్తిస్తున్నారు

ఆవేళ ఆఫీసునుండి బయటపడి మనసు తలచిన తలపు కాళ్లు తీసిన త్రోవగా వెళుతున్నాడు పెదబజారులో జనం ఆసులో గొట్టాల్లా తిరుగుతున్నారు ఎవరికి నిజంగా ఎంత పనుందో ఎవరికీ తెలియదు

ఆడవాళ్లు అందంగా సంచరిస్తున్నారు సుందరం నడుస్తూ వాళ్ళ నవలోకిస్తున్నాడు

తలనిండా పూలు తురిమి, ధవళదుకూలం ధరించి, ఎఱ్ఱటి గాజులో బిగుతుగా దాచుకున్నావ్—మధురభామినీ, నీ మాంగల్య మేది - వెలయాలివా నీవు, మగనాలివా

సగమల్లిన జడలో, సుకుమార సుమం పావడా లేసు తెలుస్తూ సన్నని వాయిల్ వలువ వక్షసంపత్తి వల్లడించాలనా అనాచ్ఛాదితంగా వదిలేశావ్ - కంచుకాన్ని గవాక్షంలా కత్తిరించావ్—

పసుడివర్ణం, పల్చటి ముఖం, చిన్నముడి మంచిపూలు - నీ దవడలు చప్పడివైనా సంసారస్త్రీ! నీవు సౌందర్యవతివి—

ముచ్చట ముడిలో కనకాంబరాలు మెడలో ఒంటిపేట మాంగల్యం, అగసౌష్ఠవం, అతికినట్లు చీర అందమైన రవిక నుదుట కుంకుమబొట్టు, నోట చక్కటి నవ్వుతో ప్రసన్న ముఖీ నీవు నీ భర్తకు జోలలు పాడతావా, జావళీలు నీకు రావేమో—

గడిమాట గుబ్బెతా, అతుకుల్లో చిరుగుతోంది రవిక, ఆగటల్లేదు అవయవాల పొంగు, కొప్పులో పూలు కులికిపోతున్నాయ్, నీ గారపళ్లలో కవితలున్నాయా - నీ వవరి కాంతవో రతినాథుడే వాడు

నగల భారంతో నలిగిపోతున్నావ్ - నీలవేణీ, నడుము తప్పించితే నీవు శృంగార నాయికవు కొంచెంత కుచములు, బరువైన పిఱుదులూ నల్లనిదానివే గాని లావణ్యవతివి

సన్నటిదానివే గాని చిన్నారీ, ఎముకలు తెలిసినా నీదొక విచిత్రాకర్షణ నాసికకు తగట్లు రెండు పేర్లు నీ ఉడుపుల ముడుపుల్లో వుంది నిగ్గులుదేరిన సౌందర్యం; చంచలేక్షణా, నీ ... పులకు నోచుకున్న ధన్యు డెవ్వడో—

ఈ తరుణవనంలో సౌందర్యమే వాతావరణం

అతడిచూపులు దూరంగా చెట్టుకుకట్టి వున్న సినిమా పోస్టర్ మీద ప్రసరించినయి అందులోని అప్సరస అతడివైపే చూస్తున్నది కళ్ళుదించి ముందుకుసాగాడు ఆ అప్సరస అతడినే అవలోకిస్తున్నది

అతడలాగ పోతున్నాడు ఆలోచనలర్థభాగంలో తెగిపోతున్నయి అదుపు లేకుండా, అంతంలేకుండా, లేస్తూ, అణగిపోతూ, పసివాడి బొమ్మల్లా పిచ్చివాడి గీతల్లా, మనస్సు మూలమూలలా నిండిపోతున్నయి చూసిన దృశ్యం చెదురుగా మనస్సుకు తగులుతున్నది పరిచిత ప్రదేశాలు కాబట్టి పాదాలు నిర్భయంగా వెళ్లిపోతున్నయి

గడచిన జీవితంలో కల్మష మేముంది? మురుగువాసన ముక్కుల కెగదట్టింది పరికించి చూస్తే, మురుగు గుంట ప్రక్కన గ్యాసులైటు కాంతిలో పెళ్లి జరుగుతున్నది

వీధి లైటుక్రింద వివాహంలో ఏమాత్రం విచారంలేదు వరుడు వధువును పుష్పమాలాలంకృతను చేశాడు ఆమె వ్రీడా ప్రమోదాలతో అతని నలంకరించింది సీనా రేకు డబ్బామీద సర్వీపుల్ల పెట్టి, భూనభోంతరాళాల్లో ఈవార్త వినపడేటట్లుగా మ్రోగించాడో కాఫీనధారి అందరూ ఎంతో సంతోషంతో గంతు లేస్తున్నారు చెవులు చిల్లులు పడేటట్లు వివాహగీతులు పాడారు

ఆరాత్రంతా అంతే అందరికీ ఆరోజ స్వాతంత్ర్యం మన్మథునికి ముచ్చటైన రాత్రి ఆరోజున గెంతే తెగలు-స్త్రీపురుషులు, అక్కబావ అన్నవదినె, అమ్మ బాబు యిదంతమానవకల్పితం - తాటి మధువుతో నిషామందిర ప్రవేశం, ఆమందిరంలో నీవూ నేనూ - ఉదరం కల్పించే సమస్యలన్నీ గతజీవితంగా నిలచిపోతయి ప్రకృతి కల్పించిన ఈ విరామ సమయంలో, గతమంతా జరిగిపోయినది భవిష్యత్తంతా రానిది

చింకి చీరెలకు శోభ కలుగుతుంది జీబురు తలల్లో పూలు పూస్తయి కాకీ నాలు పీతాంబరాలవుతయి అనాచ్ఛాదితమై, సూర్యాతపంలో కాకి రంగునలము కొన్న దేహం నీలమేఘ వర్ణ సముహాతుంది గార పట్టిన పళ్ళు పండిదంతాలు—

క్షణంలో యింటి ముందు వ్రాలాడు మమతలు రేగిన హృదయం తహ తహలాడి పోతోంది చీకటనిండిన సామాన్లగదిలో తన రసరాజ్య లక్ష్మి—

అంజలి ఘటించి అరవిందంలా మోము ఎత్తి, మోముకు చేర్చితే ఊర్పులు కలిసి ఉచ్ఛ్వాసాలైనయి రోజని రెప్పలు వాలి పోతున్నయి

సరోజినీ! నీ పెదిమెలు పగడాలల్లే వున్నయి నీ నేత్రాలు చేపల్లా వున్నయి నీ వదనానికి శశాంకుడేం సాటి సన్నటి నీ కంఠం పాలరాతితో పందెం వేయదూ—

చెలువా, నీ చిరుహాసం రతిరాజుకు పుష్పబాణం

ఏదీ, ఒక్క నవ్వు—

తలనొప్పితో బిగిసిన కణతల నడ్డు తొలగించుకుంటూ, ఒదిగొదిగి ఆ చిన్నారిసీమంతిని పెదవులమీద చిరునవ్వు లేచింది

'ఈ దేహం నాది కాదూ' అమృతప్రాయమైన ఈ ప్రశ్నకు, చిన్నతనంలోనే సిదించిన మాతృత్వంవల్ల అప్రసన్నంగా నిద్రిస్తున్న అణువులన్నీ పులకరించినయి

'ం దేహమా'

'నిన్ను నేను కష్టపెట్టానుకదూ'— ఈ మధుర క్షణంలో వేయవలసిన తెరలు తీస్తూంటే సంతోషంగా నివారించటం ధర్మం అతని ముఖాన్ని తన ముఖానికి చేర్చుకున్నది ప్రకృతి జయించింది ఆశలతో ఎండిన గుండెల్లో ప్రాణంపోసింది

'సుందరం' అన్న తల్లి ఎలుపు అవాంఛనీయంగా అదుపులోకి తెచ్చిందా స్వర్గ సంతోషాన్ని - క్షణకాలమే - తల్లి తలుపు చాటుకు పోయింది పిల్లలు పిలుపును మరచిపోయారు

బుగ్గలు నిమురుతూ గర్భవతి కోరింది పతిని—

'ఒక్కసారి మా నాన్నను చూడాలని వున్నది'

'దానికేం' - బుగ్గమీద చిటిక పడ్డది—

అత్త కోడల్ని చాటుకు పిలిచి హెచ్చరించింది 'జాగ్రత్త, నిండు నెలల దానివి'

కోడలు ముఖంలో ప్రసన్న హాసం-అత్త హృదయంలో తృప్తి గోచరించినయి

అన్నం ముందు అమ్మ చెప్పింది

'ప్రక్కింటివారి గోపాలం, ఎదురింటి

(56 వ పేజీ చూడండి)

# వీరుల కొలుపు

రోహిణి కార్తె సూర్యుడు రోళ్లు బ్రదలు చేస్తోంటే మధ్యాహ్నపు వాయువు ఆయన కిష్టమైన వీవన వీస్తున్నాడు ప్రతివస్తువు పసిడిలా మిలమిల మెరుస్తోంటే - కళ్ళు బయర్లుగప్పేలా వెల్లమబ్బు కాంతిలు, కిన్నెరసాని నృత్యం చేస్తున్నాయి పచ్చని వృక్షాలన్నీ మూడు మొగాల్తో, ఇష్టంలేకపోయినా తల లాడిస్తోంటే ఎండిపోయిన నక్కలేటి మడుగులో దాక్కున్న పంకిల సలిలములో గేదెలు, ఇష మెచ్చినట్లు వసంతస్నానం చేస్తూ, సయ్యాటలాడుతున్నాయి బూడిదవరపు మృత్తికామతల్లి పదహారణాల కమ్మని వేడితో మిలమిల మెరిసిపోతోంటే - వూరుమీద వూరు బడ్డట్టు, నక్కలేటి ఒడ్డునుండి, వీరుల కొలుపు సమాజం బయల్దేరింది

ఊరు ముందుకొచ్చిన వూరేగింపు వాయిద్యాలన్నీ 'పూర్వపు రాజులు దండెత్తి శత్రురాజ్యపు సరిహద్దుమీద వేసే రణభేరిల్లా, ఒక్కసారే ఎక్కటిల్లాయి వెంటనే నలుగురు పెదలు నలుబది మూళ్ళ ముతుకదుప్పట నాలుగంచు చివరలు పట్టుకొన్నారు ఇంకో పెద్ద మనిషి నాలుగు మూరల ములుగ్రను, దుప్పట్రకింది మధ్యభాగానికి దూర్చి, గాలిదుమ్మరు లేచిపోయే హోరాహోరీల గుడారంలా తయారుచేశాడు మరొక పెద్దమనిషి, తాంబాళంలో, పసుపు గుగ్గిలం వగైరా సామగ్రితో వుంచబడిన కత్తితో, ఒక మృణ్మయ ప్రతిమతో, నోట వీరపసుపు చుక్కబొట్టుతో విరాట్స్వరూపంలా వచ్చున్నాడు ఈయనకు ముందుగా ఇద్దరు యోధశేఖరులు, పసుపుబూసిన గోగునారపేట మోకులను రెండు చేతుల్తో పట్టుకొని, శివపార్వతీ నృత్యం ప్రారంభించారు వారి మధ్య ఒక లంబోదరుడు నాలుగు వేపమండలు పట్టుకొని, లయకు సరిపడేటట్లు, వాటిని వూగిస్తూ, కాళ్లు పైకిలేవకున్నా కష్టపడి చిందులేస్తున్నాడు 'నన్నాయి నాన నాన నానన్నా నాన నాన నానన్నా,' అనే ఒకే శృతిలో వీర గానాన్ని ప్రసారిస్తోంటే— డోలు తగ్గ 'దశరథ తా' ళాన్ని అన్వయిస్తోంది కొమ్ముల ఒయ్యన్న ఇత్తడి కొమ్మును మోరపైకెత్తి 'ఉఊ ఉఊ,' అని అరుస్తోంటే - వాళ్లతమ్ముడు జంట మృదంగంపై 'పంపనం పెం పంపనూ పంపనం పెం పంపనూ,' అనే మృదంగాన్ని బజాయిస్తున్నాడు 'డంగ్ డండం - డంగ్ డండం' అని కనక తప్పెట ఉద్ఘోషిస్తుంటే గుగిల ధూమపాత్ర చుట్టు వరస తప్పకుండా, ఒకసారి కుడిచేయి, మరోసారి యడం చేయి పైకెత్తి పాదాలు బొబ్బలెత్తిపోతున్నా శరీరమునుంచి ఘర్మసలిలం పొంగి బటలను ముంచి ఎత్తుతున్నా ముఖాలపై పచ్చని పసుపుబొట్లతో పశుపతి సముఖంలోని ప్రమథగణ సప్తమాతృకల నృత్యం ప్రతిబింబించే రీతిగా నేత్రానందం కర్ణానందంగా జరిగిపోతోంది

ఇంతలో వేపమండల నాట్యాచార్యుడు మండలను మొలలో దూర్చి రెండు చేతుల వేళ్ళు కలిపి వెల్లకిలా త్రిప్పి, చేతులు పైకెత్తి వెన్ను విరిచి, పళ్ళు పటపటకొరికి, కళ్లెర్రజేసి, 'హాయ్' అని

## శ్రీ రాళ్ళబండి రామకోటీశ్వరరాజు

బ్రహ్మాండం బ్రదలయ్యేలా - వెర్రి కేక పెట్టాడు వెంటనే వాయిద్యాలన్నీ తమకున్న శక్తినంతా వినియోగించి, మూడో కాలంలో ప్రయాణంచేస్తున్నాయి ధూమపాత్రలో ఒక ఎడికెడు గుగ్గిలం చల్లారు వెంటనే, గూడ్సుట్రైన్ ఇంజన్‌లో బొగ్గువేసినప్పుడు వచ్చేలా ధూమం సుళ్లు తిరిగి అందరి నాసికారంధ్రంలోకి జొరబడిపోతోంది ఛళ్ మని మ్రోగిస్తూ, పేటామోకులవారు, లంబోదరుని సాన్నిధ్యానికొచ్చి రెండు రెక్కలు పట్టుకోగానే, కార్యదర్శి ఒక బిందెడు చన్నీళ్లు తలపై పోశాడు వెంటనే బాజాలన్నీ బందైనయ్—

"ఎవరు బాబూ - నువ్వు?"—

"హు పోఁ నన్నా నన్నా- తెలుసుకోలేరా?'—

"చెప్పు తండ్రీ ఎవరో - తప్పులుంటే క్షమించు, ఏదో తెలియని మూర్ఖులం "

"ఆఁ ఆఁ కళ్లకు పొరలు కప్పినయ్! కళ్లకూ పొరలుకప్పనయ్ "

"తప్పేంది నాయనా! ఏంత పొప్పె తెలిసికోలేము - కటాచ్చించు - కటాచ్చించు"—

"ఆడబిడ్డను మరచి పోతారా!-ఆడబిడ్డనూ?"—

"ఓ నువ్వా నర్సమ్మతల్లీ! నిన్ను మరవలేదు తల్లీ - నీకేం కావాలో చెప్పు తల్లీ'—

"నాకేం - యిస్తానన్నారో మర్చిపోయ్యారా?"—

"మరచి పోయ్యాం తల్లీ - మరచి పోయ్యాం తల్లీ - చాంతించు, చాంతించు—'

హూ హోఁ—కూతురు పెళ్లికి, నాపేరుతో అమ్మోరికి గొర్రెపోతునిస్తాననలా! హోఁ హూ ?—

'మర్చిపోయాం తల్లి కటాచ్చించు - రేపు కాలం సల్లబడంగనే తప్పక నీక్కొలుపు కొలుస్తా - యీసారి యీ చెల్లమ్మ కొలుపుకు అడ్డంరాకు యింతమాత్రం కటాచ్చించాలి తల్లీ'—

"హూ హోఁ సరే"—

మళ్లీ ఓబిందెడు నీళ్ళు నెత్తిన పోయబడ్డాయి పేటాల్ మోకులు ఫెళ్లున, ఆడబిడ్డ పూనిక పూనిన గణాచారి చేతులపైన, నాట్యంచేశాయి - మైకం వదిలింది-మళ్లీ నాట్యం, గానం, వాయిద్యం, ప్రారంభమైనాయి—

గ్రామంలో ఇంటింటికోతి బిందెడు నీళ్ళను వారబోయించుకొంటూ, పెద్ద కాపుగారి సంసాన గృహప్రాంగణం ముందుకువచ్చింది—

వెంటనే వాద్యసమ్మేళనం త్రికాలానికి పర్వెత్తింది నాట్యం పంచమస్థాయిలో వుంది ఒకరి నొకరు కరచుకొంటున్నట్లు కొట్టుకొంటున్నట్లు నాట్యాచార్య సమూహం సాంతం వీరాంగ సాగరంలో ఓలలాడుతున్నారు—

అకస్మాత్తుగా, దుప్పటి గుడారం మధ్య తాంబాళం పట్టుకొస్తున్న కథానాయకుడు వున్నట్లుండి, వూగిపోతున్నాడు - వెంటనే వాయిద్యాలు, ఎక్కటిల్లాయి ఆచారంగా బిందెడునీళ్లు శిరస్సుపై గుమ్మరించబడ్డాయి వెంటనే వాయిద్యాలు విశ్రాంతి స్థాయి

కొచ్చాయి పెటాపెటాకుల అక్షతలు వెంటనే రెక్కలు పట్టుకోవడం - ఫెళ్లు - ఫెళ్లు - మువడ్డం కూడా జరిగాయి—

"సామీ! - నువ్వెవరు తండ్రీ?"—

"హు హు హు నన్ను కనిపెట్ట లేరా! కనిపెట్టలేరూ - కావరం కళ్ళు గప్పినప్పుడు నేన్ కనపడతానా?"

"తప్పేందిసామీ - ఛమించు నువ్వెవరో సెప్పు, నీకేం కావాలో సెప్పు!"

"హుహు హు కుల దేవతను మరచార్రా! కుల దేవతను"—

"ముత్తైలమ్మ తల్లివా తల్లీ! నిన్ను మరువలేదు చమించు - చమించు."

"కూతురు పెళ్లికి బోనం చేయిస్తా నన్నేదురా? బోనం - హు"

"మర్చిపోతేతల్లీ - మర్చిపోతే - శాస్తి చేయిస్తా!"

"హు సరే"

మళ్లీ బిందెడునీళ్లు చిలకరించబడ్డాయి ఫెళ్, ఫెళ్ న, పెటామోకు వీరహస్తాలపై శబ్దించబడింది ఇంతలో పెద్దకాపు గారి శరీరప్పళ్లెం పర్యాత్తివచ్చింది కొంచం బోనం కోశాలో వేసి, కొంతసేపటిలో మిగిల్చి, పెద్దకాపుగారి చుట్టిరంజింపారు తర్వాత పెద్దకాపుగారి చుట్టూ, ఈగల్లే పిల్లలు మూకిరాడు - ఊరేగింపు ముందుకు సాగింది.

శతవిధ గతుల కదంతో, సహస్ర విధ గతుల నాట్యంతో, లక్ష గతుల మృదంగ తరంగిణులతో, కళ్యాణగృహ ప్రాంగణ సామీప్యానికి చేరింది ఇప్పటికి అందరు

(58-వ పేజీ చూడండి)



పాంట్ వేసిన ఒక కుఱ్ఱాడు గిరగిర తిరిగి పడ్డాడు

# సినిమా కథ

"చాలా గొప్పవాళ్ళతో స్నేహం అయిందిరా"

చెబుతున్నాడు కామేశం

"గొప్పంటే డబ్బా'—మనిషా?" ఊరుకోక అడిగాను.

"రెండూరా! మనతో స్నేహం అంటే తెలియనిదేముంది? ఏమంటావ్?"

"అవున్లే!" అన్నాను నిజంగా అది నాకు తెలియనిదే. అది నాకు తెలిసినట్లు ఒప్పుకుంటే వాడికి తృప్తి నన్ను నమ్మించగలిగానని వాడి కనిపిస్తే చాలు. నేను "అవున్లే!" అనేసరికి కామేశానికి ఏనుగు బలం వచ్చినట్టుంది నేనెప్పుడో తప్ప వాడు చెప్పే విషయాలన్నీ సర్వసామాన్యంగా వ్యతిరేకించని అట్లాంటివాళ్ళని హింసపెట్టడం దేనికని ఊరుకొంటుంటాను. అదే సుబ్బారావు ఐతే వాడిని మాటమాటికి విశేషించాలని చూస్తాడు ధీరోదాత్తుడు కామేశం. వాడి విషయం జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ఈ సినిమా కథలు, వాడు చెప్పే వాటికన్న ఏం గొప్ప అనిపిస్తూంటుంది.

అయితే ఈ పై సంభాషణ మా ఇద్దరికీ-మా వూరు పల్లె రోడ్డుమీద సైకిలు తొక్కుతూ కామేశం, వెనక కూర్చున్న నాకు మధ్య జరిగింది ఇద్దరం - బోర్డు స్కూల్లో చదువునుంచి మిడిల్ స్కూలు ఫస్టు ఫారంవరకూ స్నేహాన్ని పెంచుకున్నాం తరవాత వేరు వేరు స్కూళ్ళలో వాడూ నేనూ చదవడం, వాడు అదనపు సంవత్సరాలు ఒక్కొక్క క్లాసుకు బాకీ పడడం, నేను నిరాఘాటంగా పురోగమించి పూర్తిగా ఏ బాకీ లేకుండా చేసికోవడం జరిగాయి తర్వాత ఎప్పుడో నాకు సరిగా తెలీదు, స్కూలు ఫైనల్ అయిందనిపించాడు కామేశం

కారుకోసం ఎదురుచూస్తున్నా. ఇంకా గంటదాకా కూర్చోవాలి. ఇంతలో హఠాత్తుగా నాపాలిట 'ఆపద్బాంధవుని లాగ' కామేశం సైకిలుతో నాకెదుట సాక్షాత్కరించి "వెనకాల కూచో, తీసికొని పోతా" అన్నాడు మనసులో అభినందించి [illegible] వాడు నన్నెక్కించుకొని సైకిలు తొక్కాలనే జాలిచేత కాక, వాడు చెప్పబోయే విషయాలను నిర్బంధంగా వినితీరాలి గనక, (వాడు ఏదో ఒకటి చెబుతాడని నే నెరుగుదును) చెప్పే కామేశంకంటె వినే నాకు ఎక్కువ ఓపిక కావాలి కనక, ఇద్దరం 'టిఫెను' తిని జేబులో సిగరెట్లు దట్టించుకుని సైకిలెక్కాం.

మా ఇద్దరి మధ్యా మౌనాన్ని భరించలేను. పోట్లాటైనా భరించగలను. అయితే మాట్లాడుకునే విషయాలు నా ప్రత్యేకాభిరుచికి సరిపోయేవైతే తప్ప, వాటిల్లో ఎంత గొప్పతనం, హాస్యం ఉన్నా ఆనందించలేను. నవ్వలేను. భరించలేను. అసహ్యించుకుంటూ. వాంతి చేసికొంటూ. పూర్తిగా అభూత కల్పనలనైనా, అధివాస్తవిక విషయాలనైనా ఆనందంగా ఓర్చుకోగలను గాని మధ్యరకమైనవి భరించడం నావల్ల కాదు.

'ఎలాగా!' అనుకుంటూండగానే ప్రారంభించాడు కామేశం. వాడేం చెప్పినా ఈ స్థితిలో వినాలి. ఎదుర్లోని వాడిని నే నేమీ బాధపెట్ట దల్చుకోలేదు. దానివల్ల నాపట్ల వాడి గౌరవం నిలబడుతుంది. నన్ను మోసం చేస్తే వాడి పాపం వాడిదే! తప్పదు. వినాలి. సైకిలు వెనకాల కూర్చోబెట్టుకొని వాడు నన్ను మోస్తున్నాడు. చురుగ్గా తొక్కుతున్నాడు కామేశం. చెట్లు అడ్డు ఉన్నచోట తప్ప సూర్యుడు నా కళ్లలో మెరుస్తున్నాడు. ఎండని భరిస్తున్నాను. ఎండలో కామేశంధోరణి ప్రారంభమైంది. వాడు చెప్పే విషయాన్ని అసలు నేను కదపలేదు. వాడే, ఏదో సంగతిలోంచి తను చెప్పదల్చుకున్నది నాకు చెబుతున్నట్టున్నాడు. వింటున్నాను. చెప్పేవి, నమ్ముతున్నట్లు, హర్షిస్తున్నట్లు, ఆనందిస్తున్నట్లు నటిస్తున్నాను అవసరమైనప్పుడల్లా. అలా చేయడం ఎంత బాధ!

"సంగతేమిటి?" అని నేను వాడిని అడగలేదు.

"మొన్న మనవూరు నా స్నేహితులిద్దరు వచ్చారురా! ఒక్కరోజే వున్నారు. నిన్న ఉదయం బస్సుకు వెళ్లిపోయారు. బస్సుస్టాండ్ దాకా వాళ్లని సాగనంపాను. నేను వాళ్లని సాగనంపడం వెంకటేశ్వర్లు, ఆనందరావూ చూసి, వాళ్లు వెళ్లాక నన్ను 'ఆ వచ్చినవాళ్ళతో నీకు స్నేహం ఎక్కడ అయింది'ని అడిగారు. అంతంత డబ్బున్న వాళ్లతో 'మనకి' స్నేహం కావడం, వాళ్లకి ఏదో గొప్పగా కనిపించిందిరా! నువ్వు చూడలేదు గాని వాళ్ళని,- నువ్వంటే పరిచయం చేద్దును మరి - ఏం దర్జారా! గదిలోంచి వీధిగుమ్మంలో అడుగు పెట్టేటప్పుడు ఒరకం జోడు. వీధిగుమ్మంలోంచి వీధిలోకి ఇంకో టనుకో! రెండు మూడు రకాల జోళ్లు తొడిగారురా."

అదో పెద్ద ఘనకార్యమా! ఘనమైన విషయంగా కామేశం దాన్ని తీసికొన్నాడనిపించగానే నా కెంతో చిన్నతనం అయింది. "అదో పెద్ద లెక్కేమిటి? అదేమంత గొప్పకాదురా" అందామనుకున్నా. కాని నే నెందుకు వాడికి ఆవిషయంలో కనిపించిన గొప్పతనాన్ని ఉత్కృష్టతని హీనం చెయ్యాలి అట్లాఅనిఅమాంతంవాడిని ఎందుకు సిగ్గుతో ఏడిపించాలి? వాడిని బాధించడంలో నాకేం చెప్పుకోదగ్గంత ఆనందం రాదు. పైగా వాడా విషయాన్నే గొప్ప చేసి చెబుతుంటేనే, సిగ్గుతో చచ్చాను. చెప్పుకోవాల్సివస్తే నా విషయం చెప్పుకోవాలి. నా కాలేజీ చదువు రోజుల్లో నాకు మాత్రం 5 జతల జోళ్లు లేవేమిటి? ఖరీదైన బూట్లు వుండేవి మరి! ఇన్ని వున్నా నేను అప్పుడప్పుడు బాత్ రూమ్ శాండిల్సు వేసికొని 'నైట్ డ్రస్'తోనే కాలేజీకి వెళ్లేవాడిని. నవ్వడానికిగాని పేర్లుపెట్టి పిలవడానికిగాని ఏ ఒక్క స్టూడెంటు ధైర్యం చేయలేకపోయేవాడు. అందరి 'డ్రెస్' మీదా వ్యాఖ్యానించి వెళాకోళం చేసే మా 'ప్రాక్టికల్ డిమాన్‌స్ట్రేటర్' నన్ను ఒక్క [illegible]

చెప్పుకోగలిగితే అసలు నాదీ గొప్ప! కామేశం స్నేహితుల్లాంటివాళ్ళు సవాలక్షమంది వున్నారు. అందులో గొప్ప ఏం అఘోరించింది? అనుకుని - ఆ స్నేహితుల గొప్ప ఏమిటో 'టెస్టు' చేసే వుద్దేశంతో అడిగాను.

"అయితే అందులో ఏ ఒక్కడూ నీకు ఉద్యోగమే వేయించలేదురా?"

"నథవది. ఉద్యోగంకోసం వాళ్ళని దేవురించాలేమిటి? నాకు ఉద్యోగం చేయాలని లేకగాని, చేసేటట్లయితే హాయిగా రైల్వేలోనే ఉద్యోగంవస్తుంది - క్రితం సంవత్సరం నేను ఇంటిదగ్గరనుంచి పోయానూ..." అని ఆగిపోయాడు. నా నుంచి "అవును. పోగావు"-అని నాచేత అనిపించుకుని దాంతో తను చెప్పదల్చుకున్న విషయానికి 'ఎఫెక్టు' తెచ్చుకొని ముందుకు సాగిపోదల్చుకున్నాడు.

"అవును జ్ఞాపకంవుంది" అని పూర్తిగా నేను అన్నానో, ఇంకా అంటున్నానో అందుకున్నాడు—

"ఆ పోయినప్పుడు చాలామంది రైల్వే గుమాస్తాలు, గార్డులు చెకింగ్ ఇనస్పెక్టర్లు, స్టేషన్మాష్టర్లతో - స్నేహం అయింది. కావాలంటే వాళ్ళే ఎక్కడో అక్కడ వేయించగలరు!" అన్నాడు కామేశం.

ఉద్యోగం, అందులో రైల్వేఉద్యోగం అంత తేలికగా వచ్చే మాటైతే అంతకంటె ఇంకేం కావాలి! వాడి మాటల ధోరణిని బట్టి రైల్వేలో ఉద్యోగం దొరకడం చాలా తేలిక అన్నట్టు నాకు అర్థమైంది. అది రావడంలో ఏమీ కష్టంలేదనికూడా వాడి మాటల ధోరణినిబట్టి తెలిసింది. అయినా స్వతంత్రం వచ్చాక రైల్వే ఉద్యోగాలు అంత తేలిక అయిపోయినాయి కాబోసు!-

అయినా నాకు వాటినిగురించి ఏమీ తెలియనప్పుడు, నేను వాడి మాటే కాదు, మరొకడి ఎవడిమాటైనా నమ్మి సరిపెట్టుకోవాలి కదా! అయినా అంత చిన్న విషయంలో



"ఆ సంగతి నాకు తెలియదేమిట్రా! అబద్ధాలు, కోతలు, స్వతహా రావాలిగాని నేర్చుకుంటే వచ్చేవికావు"

 సినిమా కథ 

అబద్ధం ఆడడంగానీ, కోత కోయాల్సిన అవసరంగానీ వుంటుందనుకోను వాడికి. నాదగ్గర, కొస్తేమాత్రం వాడికేం వస్తుంది? ఉద్యోగం వచ్చిందా - సంపాయించుకుంటాడు. నాకేం కావాలి? "ఈ ఉద్యోగాలు దొరకడమే చాలా కష్టమని" దరఖాస్తు పెట్టినవాళ్ళు చెప్పగా నేను నెల్లాళ్ళ క్రితమే విన్నాను. బహుశః నెల్లాళ్ళ క్రితానికీ ఇప్పటికీ ఏమైనా మారిందేమో! ఏం చెప్పగలం!—

"ఐతే నీకు ఉద్యోగం సిద్ధంగానే వుందన్నమాట - 'వర్రీ' అవవలసిన బాధే లేదురా హాయిగా!" అన్నాను గొంతుకలో తృప్తిని ప్రకటిస్తూ—

"లేకపోతే టిక్కట్టు లేకుండానే ఎల్లా తిరిగాను - అంతమంది 'ఫ్రెండ్సు' లేకుండా? ఎక్కడా మనని అడిగినవాడే లేకపోయే డనుకో?"

"అహాఁ!" అన్నాను. కామేశాన్ని టిక్కట్టులేకుండా ప్రయాణం చేయనిచ్చిన ఆ రైల్వే ఉద్యోగుల గొప్ప ఉదారత్వాన్ని వీలైనంతవరకూ ఊహించుకొన్నాను. తన్ని తరిమే మిగిలిన ఉద్యోగస్థులకన్న, కామేశాన్ని ఏ చిక్కూ లేకుండా చిత్రంగా ప్రయాణం చేయించడంలో సహాయపడిన ఉద్యోగస్థులు వాడికోసమే జన్మించినట్లు వాడి మాటలవల్ల చక్కగా విశదమౌతుందాయె. అట్లాంటప్పుడు వాడి ఒళ్ళు ఎంత హూనం అయింది, ఎన్నిసార్లు తన్ని స్టేషన్లలో దింపేశారు అనే విషయాలను ఆలోచించాల్సిన అవసరమే లేదుకదా! అయినా అప్పటికి నమ్మడంకన్న నాకు వేరే శరణ్యం లేదు. "చావు దెబ్బలు తిన్నానురా" అని వాడు ఒకవేళ చెప్పినా జాలి దల్చవలసిన వాడిని నేనేకదా! ఇట్లాంటి దుర్భర సమయాల్లో ఏ జన్మనో చేసికుంటేనే గాని ఇలాటి గర్వకారణమైన గొప్ప స్నేహితులు అందరికీ లభ్యపడడం అసంభవం.

"చెప్పాల్సివస్తే నేను రాజమండ్రీలో చదువుతుండగా వుండే స్నేహితుల్ని గురించే చెప్పాలి. నువ్వెరగవుకాని..'లైఫ్' అంటే అక్కడిదే 'లైఫ్' అనుకో. ఏం హాయి, ఏం జల్సా...చెబితే నమ్మవుగాని..." అంటున్నాడు. విషయం మార్చాడు కామేశం.

నాకు ఒళ్లు మండింది. ఇందాకటినుంచీ వా డేవేవో చెబుతుంటే 'ఊఁ' కొట్టి నమ్ముతున్న వాడిని, ఆ క్షణంనుంచి ఇక నమ్ముతానో నమ్మనో అనే సందేహం వాడికి ఎందుకు కలగాలో నాకు అర్థంకాలేదు. నేనంటే అంత అపనమ్మకమైతే ఎట్లా? తను చెప్పబోయేవి ఎట్లాంటివైనా అవి ముందుగా ఎదటివాడు నమ్ముతానని హామీ ఇస్తేనేగాని ఈ చెప్పేవాళ్లకి చెప్ప బుద్ధిగలగదు కాబోసు. మనం ఇచ్చినా ఇవ్వకపోయినా వాళ్లు నిర్బంధంగా మన హామీని పుచ్చుకుని గాని ప్రారంభించరు. 'వెనక ఇట్లా చేసేవాణ్ణి - అట్లా చేసేవాణ్ణి' అనే గొప్పలు మన ముఖమ్మీదే జ్ఞాపకం తెచ్చుకుంటూ మనగౌరవాన్ని పొందాలని చూస్తారు. నేను నమ్మకపోతే మాత్రం కామేశానికేం పోయింది? ఎవటి, వాడు గొప్పలు చెబుతుంటే వినాల్సిన గతి పట్టిన వాడి స్థితి ఎంతశోచనీయం!

"నీసంగతి నాకు తెలియదే మిత్రా! అబద్ధాలూ, కోతలూ - చేతనవాలిగాని అవి నేర్చుకుంటే వచ్చేవి కావు. నేర్చుకున్నవి అవసరానికి పనికి రాకుండా పోతాయి" అన్నాను.

వాడు కుదుటపడ్డాడు. నేను నమ్మనేమో అనే భయం వాడికి పోయింది. ఇక ఇతరవిషయా లేవైనా వుంటే అందులో వాడు నేను నమ్మేటట్లు చూసుకో జాగ్రత్తపడాలి.

చరమదశకి వచ్చేసిన సిగరెట్ పారేయకుండా, జేబులోంచి మరో సిగరెట్ తీసి దాంతో ముట్టించుకొని రెండు బలమైన దమ్ములు లాగాను. సిగరెట్ కాలుస్తూండడంచేతే వాడి కబుర్లు వినకలుగుతున్నానా లేదా అనే విషయం అప్రస్తుతం కదా! నన్ను తూర్పు బెట్టుకొని కూడ, ఎదురుగాలిలో, మంచివేగంగా తొక్కుతున్నాడు కామేశం. ఇంతలో మమ్మల్ని దాసుకొని ఒక బస్సు దూసుకుపోయి ఇంత దుమ్ము కొట్టిపోయింది.

"వీళ్ళకి కారు నడపడం చాతకాదురా" అన్నాడు కామేశం. ఇంతకీ మాట్లాడేది కామేశమేనా! అన్నంత ఆశ్చర్యం కలిగింది అది విన్నాక.

"ఆ డ్రైవరు బాగా నడుపుతాడు నాకు తెలుసు. అతనికి చాతకాదంటావేమిత్రా! నేనే ఒప్పుకోను!" ప్రతిఘటించాను. నన్ను బొత్తిగా లోకువ చేసి మాట్లాడుతున్నాడా అనిపించింది. అయినా వీడికి కారు నడపడాన్ని గురించి ఏం తెలుసు ననుకున్నాను.

"అబ్బే! ఈడ్రైవరుకి కాదురా!" అని సర్దుకున్నాడు. ప్రతిఘటించినవ్యడు,

---

చాలా కాలం తర్వాత మామయ్య వచ్చాడు. కుర్రాణ్ణి చూసి తల్లితో అన్నాడు: "అచ్చంగా తల్లి కళ్లేసుమా!

తల్లి; "అచ్చంగా తండ్రి ముక్కే" అని కలిపింది.

వీరిద్దరిని విన్న కుర్రాడు; అచ్చంగా అన్నయ్య బట్టలే సుమా" అని తన అక్కను వెళ్ళభోసుకున్నాడు.

—శ్రీ మండలీక విశ్వేశ్వరరావు, మద్రాసు.

---

నేను నిరూపించేదాకా వదులుతానో, లేదో అని కామేశానికి భయమో! ఏమో! కారు ఇంజను (డైనమో)కి, స్టీరింగ్ కి సంబంధించిన విషయాలమీద నాలుగుమాటలు మాట్లాడి తనకు కారు 'మెకానిజమ్' తెలుసుననే విషయం సూచన ప్రాయంగా నాకు తెలుపుకున్నాడు.

"రాజమండ్రీలో చదివేప్పుడు మా క్లాస్‌మేట్ ఒకడుండే వాడులే. బాగా డబ్బున్నవాడు. వాడికి కారు డ్రైవింగ్ వచ్చు. వాళ్ళ కారుతోనే నెల్లాళ్ళల్లో డ్రైవింగ్ వచ్చేసిందిరా నాకు. కారునడపడం గగనం కాదు." అన్నాడు నిర్లక్ష్యంగా, తనకదో పెద్ద విషయం కాదన్నట్టు.

నాకు చెడ్డభయంపుట్టింది. ఎంత దారుణం! ఎప్పుడూ కామేశం తనకి కారు నడపడం వచ్చునన్న సంగతి చెప్పలేదు. వాడు నడపగలడనే విషయం ఎవరూ నాతో సరదాగా కూడ ఎప్పుడూ అనలేదు.

నడపగలడా? అనుమానం.

కోస్తున్నాడా?

అయినా ఏం గొప్ప?

కారు నడపడం ఎందుకో గొప్ప!

అందులో ఈనాడు కారు స్వంతంగా నడుపుకోవడం నాగరికతకు ఒక చిహ్నంగా గుర్తించుతున్నారాయె! నాకు రానంతలో వాడికీ నడపడం రాదని అనుకోవడం, ఏం న్యాయం?" నువ్వు చెప్పేది నమ్ముతున్నాను. సుమా!" అని హామీ కూడా ఇచ్చాను, ఇంతకుముందే.

"ఎప్పుడూ చెప్పావే కాదురా!" అన్నాను. ఇంతకాలంనుంచీ ఆ విషయం నాదగ్గర దాచడంవల్ల వాడెంతో నష్టపోయినట్లు అనిపించేటట్లుగా మాట్లాడాను. ఎందుకో నమ్మకం కలగటంలేదు.

"సమయం వచ్చింది కనక చెప్పానురా! కారు నడపడం నాకో లెక్క కాదు. బస్సు 'డ్రైవ్' చేయడమే ఎలాగైనా కష్టం"—

నేనేం మాట్లాడలేదు. వాడి వెనకన అట్లా కూర్చుని పక్కకి పరిగెత్తే పొలాల్లోకి చూస్తున్నాను. వీలైనంతవరకూ పరధ్యానం నటిస్తున్నాను. కాని వాడిమాటలు వీలైనంత స్పష్టంగా వినబడుతూనే వున్నాయి నాకు.

"ఒకసారి ఓ చిన్న చిత్రమైన 'ఇన్సిడెంట్' జరిగింది. నీ కెప్పుడూ ఇదివరకు చెప్పలేదు. ఏమైందనుకున్నావ్! ఓ రోజున — నేను రాజమండ్రిలో చదివేప్పుడేలే — సాయంత్రం రోడ్డుప్రక్కన నిలబడి ఫ్రెండ్సుతో మాట్లాడుతున్నాను. కాలేజీలో బి. ఏ. చదువుతోంది ఓ అమ్మాయి. చాలా అందమైందిలే...'

అప్పుడే, ప్రారంభించేశాడు కథ. 'ఆరి పిడుగా!' అనుకున్నాను. ప్రారంభించేడో లేదో, అప్పుడే అమ్మాయి, అందులో చదువుకున్న అమ్మాయి వచ్చేసింది కథలో. కామేశానికి కథ చెప్పే ప్రజ్ఞలేదు. ఆ అమ్మాయిని ఎంతసేపో దాచిదాచి చెప్పాలి చక్కగా. "అందమైందిలే" అని కూడా చెప్పేశాడు. ఇంకేముంది, వాడు చెప్పదల్చుకున్న దప్పుడే అయిపోయిందన్నమాట. 'నమ్మకం' మీదే ప్రపంచం నడవడం జరుగుతూంది. గనక, ఆ అమ్మాయిని నేను చూడలేదు గనక, ఆపిల్ల అందమైందంటే నేను నమ్మి తీరాలి. ఆడపిల్లలను గురించి చెప్పేటప్పుడు ముందుగా 'అందం' గురించి తరవాత 'వయస్సు' చెబితేగాని కథలు చదవరు. 'పాడుకథ' అని పేజీలు తిప్పేస్తారు. మగవాడికి అందం విషయంలో ప్రాముఖ్యత కనిపించదు. అందంతో మగవాడికి చాలా తక్కువపని వుంది కాబోసు.

"ఆ అమ్మాయి రోజూ స్వంతంగా కారు డ్రైవ్ చేసికొంటూ కాలేజీకి వెళ్ళి వస్తూంటుంది. ఆ కారు నాకు బాగా జ్ఞాపకం. మావైపు ఆ కారు వస్తూంటే అంతా అటువైపు తిరిగిచూశాం. మాకు ఓ ఇరవైగజాల దూరంలో ఆ కారు నెమ్మదిగా ఆగిపోయింది...ఒక్కసారి ఇటు నీ సిగరెట్ ఇయ్యి. అంటించుకుంటా!" అన్నాడు కథను మరింత రసబంధురం చేయదలిచేందుకు వాడు సిగరెట్ వలిగించుకోబోతున్నాడు. బాగుంది. నా కాలుతున్న సిగరెట్ వాడికిచ్చాను.

నన్నెందుకో అనుమానం పీడిస్తోంది. నేనెన్నో 'ఫేంటసీస్' బాగా నమ్మగలిగేట్లు వ్రాశాను. అధివాస్తవికమైన కథలూ వ్రాశాను. నిత్యజీవితాన్ని చిత్రించే కథల్లో అసహజాల్నీ, అసందర్భాలనీ మాత్రం నేనెప్పుడూ చిత్రించలేదు. విదేశీ నాగరికత, దేశంలో ఎంత పెచ్చరిలిపోతున్నా, ఆంధ్రదేశంలో, ముఖ్యంగా రాజమండ్రీ, కాకినాడ నగరాల్లో, మిగిలిన ప్రదేశాలకన్న చాలా తక్కువే. నే నెరిగున్నంతలో ఆ రెండు చోట్లా కాలేజీలకి స్వంతంగా ఆడపిల్లలు కారుడ్రైవ్ చేసికొంటూ రావడం చూడలేదు. వినలేదు. కాకినాడలో ఆ సంఘటన జరిగిందన్నా నేను నమ్మగలను. రాజమండ్రీలో జరిగిందంటే ఆవూళ్లోవాళ్లే పోట్లాటకొస్తారు.

"అంత, కారు డ్రైవ్ చేస్తూ కాలేజీకి వచ్చే అమ్మాయి ఎవర్రా?" అడిగాను ఆశ్చర్యంగా. నా ఆశ్చర్యాన్ని పసిగట్టేడేమో—

"కొన్నాళ్లు ఆ అమ్మాయి మెడ్రాస్‌లో కూడా చదివిందిలే. ఎందుకు కారు ఆపిందా ఆ అమ్మాయి అని మేము అటే చూస్తున్నాం. ఓ పది నిమిషాలకి కారులోంచి దిగి ఏం పాడైందో అని ఇంజను పరీక్షగా చూసింది. కాని కారు కదల్లేదు. చూడగా చూడగా నాకు జాలేసింది. ఏం చెడిపోయిందో సాయం చేద్దామని దగ్గరగా వెళ్లి

"ఏం! ఏం జరిగిందీ! నడవట్లేదూ" అన్నాను.

"అదే! ఏం పాడైందీ తెలియడంలా! నడవట్లేదు. మీకు ఈ 'మెకాన్జిజమ్' తెలుసునా?" అని అడిగింది నన్ను.

"ఏదో కొంచెంగానే లెండి" అని అన్నీ పరీక్షగా చూశాను. ఎక్కడా లోపం కనబడలేదు. చివరకి పెట్రోలు అయిపోయినట్లు చూసి 'పెట్రోలు అయిపోయిందండీ! కారులో వుందా, పోద్దాం!" అన్నాను. ఆ అమ్మాయి పాపం సిగ్గుపడిపోయిందరా. 'ఇప్పుడెలాగా!' అంది. ఆ అమ్మాయి దగ్గర డబ్బు లేదని తెలిసి 'ఫరవాలేదు లెండి. నాదగ్గర 'మనీ' వుంది అని మాస్నేహితుడివగ్గర సైకిలు తీసికొని పెట్రోలు కొని పట్టుకొచ్చిపోశాను.

# ★ సినిమా కథ ★

'థాంక్స్. ఈ కారులో మా ఇంటికి రండి. మీ మనీ ఇచ్చేస్తాను' అంది.

'మరేం ఫరవాలేదు. డబ్బెక్కడికి పోతుంది. మళ్ళీ కనిపించినప్పుడు ఇవ్వొచ్చులెండి' అన్నాను.

'అలా కాదు. పోనీ మా ఇల్లయినా చూద్దురుగాని' అంది. "నాకు వళ్ళాలనే వుంది. అలా శెట్టుచేయక పోతే గొప్పగా వుండదు చూడు." అన్నాడు కామేశం.

ఆకథలో కామేశం తన పాత్రగొప్పగా పోషించినందుకు నేను చాలా గర్వపడ్డాను. అల్లాంటి విలువైన సమయాల్లోనే మనిషి (పాత్ర) గొప్పతనం బైటపడుతుంది.

"అయితే ఏం చేశావేమిటి?" కథ త్వరలో ముగిసిపోతే బాగుండు ననిపించింది. అందుకే వాడు ఒక్క ముక్కలో తేల్చిచెప్పగలడేమోనని చూశాను. ఆ అమ్మాయికి, అందులో అందమైన అమ్మాయికి వచ్చిన కష్టం సమయంలోనే కామేశానికి తటస్థపడడం, అందులోనూ, వాడి జేబులో అందుకోసమే, అన్నటు సిద్ధంగా డబ్బు వుండడం - అన్నీ కలిసివచ్చాయి. అది వాడి అదృష్టం కాకపోతే మరేమిటి? మరోసారి ఎప్పుడైనా వాడికల్లాంటి 'ఛాన్సు' దొరికినా సమయానికి జేబులో డబ్బులేకపోతే ఎంత చిన్నతనం 'ఫీల్' కావలసివచ్చును ఈ ధీరోదాత్తుడు. ఆ ధీర లలిత ఆ సమయంలో ఎంత గాయపడి కామేశం సహాయాన్ని అంగీకరించిందో! ఆలోచించుకుంటున్నాను.

"నన్ను డ్రైవ్ చెయ్యమని వెనక సీట్లోకి వెళ్ళికూర్చుందిరా! ఇక తప్పలేదనుకో!" అని కామేశం నోట్లో సిగరెట్ అవతల పారేశాడు.

"ఇహనేం! డ్రైవ్ చేశావన్నమాట!" అన్నాను వాడి ఘనకార్యాన్ని ఉగ్గడించే ధోరణిలో. ఎందుకో నాకు నవ్వొస్తోంది. నెమ్మదిగా నవ్వేశాను. వనక కూర్చోవడం చేత నేను నవ్వినట్లు కామేశానికి తెలియదు.

"మంచి ఛాన్సే కొట్టావురా!" అన్నాను సందేహంతో లోపల బాధపడుతూ.

"ఛాన్సని నెమ్మదిగా అంటావేమిటి! హోరెత్తించేశానురా. గోదావరి స్టేషను వైపున ఉంది వాళ్ళిల్లు. తీసికెళ్ళాను"—

"నీ పక్కసీట్లో కూర్చోక వెనక కూర్చుందేం! ఏమైనా భయమా!" అడిగాను సందేహం తీరక.

"వేళాకోళం చేస్తున్నావేమిట్రా?"

"ఛ! ఛ! అదికాదురా! వెనకెందుకు కూర్చుంది అని అడిగాను. అంతే" అన్నాను వాడినివేళాకోళం చేస్తున్నట్లు అనిపించకుండా వుండేందుకు.

"కాలేజీ స్టూడెంట్సు చూస్తే ఏడిపిస్తారేమో అని భయం చేతేమో!" అన్నాడు. మెడ్రాస్‌లోకూడ చదివిన ఆ అమ్మాయికి ఎందుకో భయం మరి! ఆడపిల్ల, కాలేజీకి కారు స్వయంగా డ్రైవ్ చేసికొంటూ వస్తే ఏడిపించని స్టూడెంట్సు, ఎవరో డ్రైవ్ చేస్తూండగా పక్కగా కూర్చుంటే ఆ అమ్మాయిని ఎట్లా ఏడిపిస్తారని ఊహించను? పోనీ ఊహిస్తాను. అంతకన్న ఏం చేయను. నిస్సహాయంగా వింటున్నాను. కథ వింటుంటే కళ్ళు తిరుగుతున్నాయి.

"ఇంట్లోకి వచ్చాక, కుర్చీలో కూర్చోమని నాకు కాఫీ తెచ్చియిచ్చి—

"ఒక్క అరగంట వెయిట్ చేస్తారా. మా నాన్న క్లబ్‌కు వెళ్ళారుట. 'ఐరన్ సేఫ్' తాళంచెవి ఆయనదగ్గరే వుంది. ప్యూన్‌ను పంపిస్తున్నాను' అంది.

'మరేం ఫరవాలేదులెండి' అని కూర్చున్నా - రేడియో పెట్టింది. కాసేపట్లో వాళ్ళ నాన్నగారే వచ్చారు. నా డబ్బు నాకిచ్చి 'ఎప్పుడైనా వస్తూండేం అబ్బాయ్!' అని చెప్పారు. 'సరే అలాగే నండీ.' అని చెప్పి వచ్చేశాను" అని ఆగిపోయాడు కామేశం.

నాకు అనుమానం కొంచెం ఎందుకో బాధించింది కనుపుణోంచి. ఇనప్పెట్టె తాళం చెవులు కూడా ఎక్కడికి వెడితే అక్కడకు ఆయన పట్టికవెళతారు కాబోసు. అదేదో చాలా కొత్తగా వినిపించినా, సరిపెట్టుకొని—

"నీ పేరేమిటో అడిగిందా అసలు ఆ అమ్మాయి? మళ్ళీ ఎప్పుడైనా వాళ్ళింటికి వెళ్ళావా. తరవాత ఏమైంది?" ఆ కథ అంత దారుణమైన ట్రాజెడీ అవుతుందనుకోలేదు నేనసలు.

"వెళ్లకేం! అప్పుడప్పుడు వెళ్లేవాడిని. కాఫీ యిచ్చి మాట్లాడేది"—

"నువ్వంటే ఇష్టమేనా ఆ అమ్మాయికి." అడిగాను కామేశాన్ని.

దాంతో "నీమీద ప్రేమ వుందా" అని నా అభిప్రాయం.

"ఇష్టం గనకే లాస్టియర్ ఒక్కర్తే ఆ కారుమీద మన వూరు వచ్చి మా ఇంట్లో ఒకరోజు ఉండి వెళ్ళింది" అన్నాడు.

"అహాఁ! అయితే మీ నాన్న వాళ్ళుకూ ఏమీ అడగలేదూ"—

"అడక్కేం. అడిగారు. జరిగిన కథంతా చెప్పాను. ఆ అమ్మాయికీ నాకూ 'ఫ్రెండ్షిప్' అన్నాను" అన్నాడు కామేశం.

"ఆ అమ్మాయి ఇప్పుడింకా రాజమండ్రీలోనే వుంటూందా? ఏం చేస్తూంది?"

"లేదురా! వాల్తేరు వెళ్లిపోయారు. ఆ అమ్మాయి అక్కడే ఆనర్సు చదువుతోందిట" అన్నాడు.

చాలా విచారించాను. దురదృష్టవంతుడు కామేశం అనుకున్నాను.

"ఇంతకీ ఆ అమ్మాయి పేరేమిటి? వాళ్ల నాన్నగారి కేం పని?"

ఇంకే విషయం అడిగి, నా బుఱ్ఱ పాడు చేసికో దల్చుకోలేదు. ఇదే ఆఖరు ప్రశ్న అనుకున్నాను.

"వాళ్ళ నాన్నగారికి వాల్తేరు బదిలీ అయిపోయిందట. రైల్వే ఆఫీసులో పని" అన్నాడు ఏమీ జంకకుండా కామేశం. నా మిత్రుడు కామేశం.

అంత ఘోరం వింటానని తెలిసివుంటే ఆ ఒక్క క్షణం నాకు బ్రహ్మచెముడు రప్పించవలసిందని దేవుడిని అర్థించివుందును. ఆ అమ్మాయి పేరు చెప్పాడో లేదో నాకు వినిపించలేదు. అసలు వాడు చెప్పివుండడు. ఈ కామేశాన్ని ఈ చెవులతో ఎట్లా నమ్మను? ఆ అమ్మాయి తండ్రికి రైల్వే ఆఫీసులో పనా! ఆయన క్లబ్‌కు వెళ్ళాడా? కూడా ఇనప్పెట్టె తాళం తీసికెళ్ళాడా! తాహతులేని, రైల్వేగుమాస్తా, కూతురుకి ఎంత ప్రేమ వుంటేనుట్టుకు ఒక ఖరీదైన కారు కొని పెటగలడా? ఎలా నమ్మను? ఎలా భరించను ఈ అసందర్భాలు?

బుద్ధి వచ్చేలా, మళ్లీ అట్లాంటివి మాట్లాడకుండా వుండేందుకు, కామేశాన్ని గట్టిగా తిడదామనుకున్నాను. ఏదో అందామనుకుంటుండగా నే—

"అంతా ఇదేదో చిత్రంగా అనిపిస్తోందా లేదా నీకు! చెబితే చాలామందికి నమ్మకం కలగదు. నిజమని నమ్మరురా!" అన్నాడు. నేను విన్నందుకు కృతజ్ఞతలు కాబోసు.

"చిత్రంగా, సినీమా కథలా వుందిరా!" అన్నాను. వాడిని అంతకన్న తిట్టడం చాతకాక. అందులోనే, నా కోపాన్నంతా ఇమిడ్చాననిపించింది. నిజానికి ఇట్లాంటి కథల్నే బాగా పొడిగించి, నాలుగైదు మంచి ప్రేమ సీన్లు పెట్టి, ఉన్న అసందర్భాలని తీసి వేయకుండా వుంచితే, మనం రోజూ చూసే గొప్ప సినీమా కథలకి మా కామేశం కథ ఏమాత్రం తీసిపోదు అనిపించింది. ఇంతకీ కామేశంగాడు తనకీ ఆ పిల్లకీగల ప్రేమ, విరహం గురించి ఒక్క ముక్కైనా చెప్పలేదు. తన కథకి అట్లాంటి వేమీ ఉన్నట్టే మాట్లాడలేదు వాడు. అబ్బాయీ,

(56-వ పేజీ చూడండి)

# ★ తర్క కర్కశుడు ★

(కీ. శే. కళాప్రపూర్ణ డాక్టర్ చిలుకూరి నారాయణ రావుగారి రచన)

ఆయన పేరు మర్కట శాస్త్రి
అసలు పేరు అక్కప్ప అయినా
ఎట్లో వచ్చి కుదురుకొంది
జీడి మరకలాగు స్థిరమైపోయింది.

తోముతే తోలయినా ఊడుతుందిగాని
ఆ పేరు మాత్రము విడువదు.
లోకం పెట్టిన పేరు లోక మున్నంత దాకా
పోకుండా ఉండవలసిన దేగా!

పేరును బట్టి లక్షణం వస్తుందా?
లక్షణాన్ని బట్టి పేరు వస్తుందా?
పేరెట్లు వస్తుందో పెద్ద పెద్ద వాళ్లే
నోరెట్టి వాదించి ఊరుకొన్నారు.

ఉన్న పేరు ఉన్నట్లే ఉంటేగా?
ముద్దున పేరు చెడుతుంది
గుద్దున గూను చెడుతుంది
పద్దున పరపతి చెడుతుంది
సద్దున గురి చెడుతుంది

అక్కప్ప పేరు ఎట్లా చెడిందంటే
అక్కప్ప చదువుకొని అర్కప్ప అయినాడు,
ఎప్పుడో బట్టమరక అయితే
చూచుకోకుండా తిరగడము చూచి
అర్కప్పను మర్కప్ప అన్నారు.
మర్కప్పకూ మర్కటప్పకూ ఎంత దూరం?
తర్కం నేర్చిన తరువాత తప్పిందే కాదు
ప్రాసం కూడా పట్టుకొంది.

మర్కటశాస్త్రి తర్క శాస్త్రంలో
కర్కట కర్కశుడనే కఠినమైన ఖ్యాతిని
సంపాదించుకొన్నాడు.

పరిచ్ఛేదములో ప్రజ్ఞావంతుడు;
అప్రతిమానాపరిమేయప్రజ్ఞ;
ఏ వాక్యమయినా సరే, ఏ భావమైనా సరే,
భావ మున్నా సరే, లేకున్నా సరే,
ఆయన చేత—కాదు నోట—పడిందంటే
ఈకకు ఈకా, తోకకు తోకా
ఎక్కపెట్టి ఈడ్చి పారవేస్తాడు.
వెన్నలో వెంట్రుకలు తీస్తాడు.

ప్రత్యక్షం, ఉపమానం,
అనుమానం, ఆప్తవాక్యం,
ఏమి ప్రమాణం కావలిస్తే అదీ, అన్నీని,
గుప్పించి, గుప్పించి, గంతు లేస్తాడు.
వితండ జల్పాలంటే
వెలగకాయ లోట లోటలు
ఆయననోట బడ్డ ఏదయినా సరే
ఏనుగుతిన్న వెలగకాయలాగు
దెయ్యము కొట్టిన కొబ్బరికాయలాగు
ఇవతలకు వచ్చి ఊడి పడుతుంది.

అవచ్ఛేదాలాయన కనర్గళం.
నిరపేక్షాలాయనకు నిరర్గళం
సాపేక్షాలయితే ఝుళం ఝుళం
గడ్డు ప్రశ్నలన్నీ గళం గళం.
తర్క కర్కశుడు—మా
మర్కట శాస్త్రి.



# విజ్ఞానవీధులు

"డాక్టర్"



## 146. ఇనుపఓడ నీటిలో ఎట్లు తేలుచున్నదీ?

ఇనపముక్కలు నీటిలో మునిగిపోతాయి గదా, ఇనపరేకుతో చేసిన ఓడ ఎలాగు తేలుతోంది? అని ప్రశ్న. ఇత్తడి బిందెను నీటిలో విడిచామనుకోండి. అది నీటిలో తేలుతుంది. బిందెబరువు కిందివైపు లాగుతుందని మనకి తెలుసు. అయితే బరువు దిగలాగుతూన్నా బిందె దిగిపోవడము లేదు. అంటే ఏమన్నమాటా? నీరు బిందెను పైకి నెట్టుతున్నదన్నమాట కాదూ? బిందె బరువూ, బిందెను నీరు పైకి నెట్టేశక్తీ సమానముగా వున్నప్పుడు బిందె తేలుతూ నిశ్చలముగా వుంటుంది. ఇనపముక్క నీటిలో వేసినప్పుడు నీటి ప్లవనశక్తి ఆముక్కబరువుకన్న తక్కువ అవడమువల్ల అది నీటిలో దిగిపోతోంది. అయితే ఇనుముతో చేసిన ఓడ నీటిలో తేలుతోందిగదా, ఈఓడని పైకి నెట్టేశక్తి దానిబరువుకి సమానమయ్యేదాకా ఎలాగ పెరిగిందీ? అదీ ఇనుమే, ఇదీ ఇనుమేనే? అంటే, "ఓడ దోనె ఆకారములో ఉండడమువల్ల, నీరు దానిని పైకి నెట్టేశక్తి పెరిగింది" అని జవాబు. ఎలాగు? అంటే ఇలాగు—బిందె తేలుతూన్నట్లు




సూచింపబడింది పటము చూడండి. బిందె లేనప్పుడు నీటి ఉపరితలము 'కచరతప' అనే గీత వెంబడిఉండేది. బిందె తేలడమువల ఈతలము 'కచటతప' అయింది. బిందెని ఎత్తివేస్తే తిరిగి 'కచరతప' తలములోకి సర్దుకుంటుంది నీరు. అంటే ఏమన్నమాటా? బిందె ఉన్నంతసేపూ 'చటత' అనే లోత్త అంతమేరా, నీరుపైకి ఉబికిరా యత్నిస్తోందన్నమాట కాదూ? ఈ ప్లవనశక్తియే బిందెను తేలుస్తోంది. ఈశక్తి యెంత? అని ప్రశ్న. బిందెలేనప్పుడు 'చరతట' అన్న లోయలో ఉండిననీరు ఈప్లవనశక్తిని సరిగ్గా అదుపులో ఉంచుతూండినది కనక, ఈప్లవనశక్తి ఆనీటిబరువుకి సమానము అన్నమాట. అన్నట్టు ఈప్లవనశక్తి బిందెబరువుకీ సమానమే. అంటే ఈ ఉజ్జీలు రెండూ సమానము అని తేలుతుంది. బిందెబరువు 'చటత' అన్న లోయలో ఉండిన నీటిబరువుకి సమానము! బిందెను మొదట నీటిలో వేసినప్పుడు నీరుతొలిగితొలిగి, బిందెబరువు ఆతొలిగిపోయిన నీటిబరువుకి సమానమవగానే బిందె తేలుతూ ఆగిపోయింది.

ఇనపముక్కని నీటిలో వేస్తే తొలిగిపోయేనీరు కొంచెమే. ఇనపముక్క పూర్తిగా మునిగినప్పుడు ఆముక్కని నీరు పైకి నెట్టుతునే వుంటుంది. ఎంతశక్తితోనూ? ఆ ముక్క ప్రవేశించడమువల్ల తొలగిపోయిన నీటిబరువంత శక్తితో. ఇది ఇనపముక్క బరువుని ఆపలేదు. అందుకని ముక్క మునిగిపోతుంది. ఈ ఇనపముక్కనే సాగగొట్టి దోనెలాగ తయారుచేస్తే, ఆముక్కబరువు మారలేదుగాని తొలిగిపోయేనీటి పరిమాణము హెచ్చింది. ఒక్క అంగుళములోతుకి మునిగితే, ఇదివరకు తొలిగిన నీటికెన్నోరెట్లు నీరు తొలుగుతుంది ఇప్పుడు. ఈనీటి బరువెంతో, అంతేశక్తితో ప్లవనశక్తి ఓడని తేల్చేస్తుంది. ఓడబరువు ఇలా తొలిగిన నీటిబరువుకి సమానమయ్యేదాకా ఓడ దిగుతుంది నీట్లోకి. తర్వాత మరి దిగదు.

ఓడలు సముద్రము నీటిలోకంటె నదీజలాల్లోకిందికి దిగుతాయి. సరికి సరా తీసుకుంటే సముద్రము నీరు మంచినీరుకన్న బరువు. ఓడబరువు మారదు కనక, సముద్రములో తేలడానికి ఓడ తొలిగించవలసిన నీటికన్న, మంచినీట్లో తేలడానికి తొలగించవలసిన నీరు ఎక్కువ. అంటే ఆ ఓడే నదీజలంలో ఎక్కువ దిగాలి అన్నమాట.

## చిట్టి ప్రశ్నలకు జవాబులు

—చంద్రుడి కళలు, భూమి నీడ చంద్రుడిమీద పడడమువల్ల కాదు కలిగేది. సూర్యుడివెల్తురు చంద్రగోళము సగభాగము మీద పడుతుంది. భూమినించి చూచినప్పుడు వెలుగుతూన్న చంద్రబింబములో ఎంతపాటి భాగము కనబడితే అంతపాటి చంద్రుడే మనకి కనబడతాడు. అమావాస్యనాడు భూమికీ సూర్యుడికీనడుమన చంద్రుడుంటాడు కనక చంద్రుని అవతలివైపు మనకి కనబడదు. పున్నమనాడు సూర్యుడు కుంకుతూంటే చంద్రుడుదయిస్తాడు. కనక సూర్యుడి వెల్తురుపడే చంద్రబింబ భాగమంతా కనబడుతుంది. అమావాస్యనించి పున్నమదాకా క్రమంగా పెరగడము, చంద్రుడు క్రమంగా సూర్యుడివైపునించి బయల్దేరి 15 రోజుల్లో ఇవతలవైపుకి రావడము వల్ల.

—'తేలికైన వస్తువు త్వరగా భూమిపై పడదు, బరువైనది పడును' అన్న అభిప్రాయము పొరపాటు. గెలీలియో అనే పదహారో శతాబ్దమునాటి ఇటాలియను వైజ్ఞానికుడు పైజాలోని వంకర గోపురశిఖరము మీదినుంచి ఒక కర్రబంతీ, రెండూ ఒకే మారు క్రింద పడ్డాయి. సీసపుబంతీ ఒకే మారు వదిలిపెట్టాడు. ప్రయోగమువల్ల పట్టినమ్మకమును చెదరగొట్టుట కతడే ప్రథముడు.

—బదనిక అన్న జాతి, ఇంకొక చెట్టు మీద పెరిగి, ఆ చెట్టులో ప్రసరించే రసాల్ని తాను ఉపయోగించుకోడము నేర్చి నేర్చి, వేళ్లను పెట్టడము మరిచిపోయింది. అందుకే ఇది పువ్వులూ కాయలూ పెట్టినా, వేళ్ళను పెంచుకోలేదు. మరి బ్రతకడము ఎలాగ? ఇంకొక చెట్టుని దోచి.

 

బదనిక నే అనడము ఎందుకు? శాఖాహార జంతువులన్నీ చెట్లు తయారుచేసే ఆహారాన్ని, పళ్లూ, వేళ్లూ (ముల్లంగి), కాండమూ (తోటకూర కాడ), పువ్వూ (అరటి), ఆకులూ (బచ్చలి) తిని తప్పరిస్తున్నాయి.

—ఉల్లిపాయ, ములక్కాడ, వంటి శాకములకు కొంచెము మాంసపు పోలిక వున్నదన్న కారణముచేత కాబోలు ఆచారవంతులు తినరు.

—సూర్యుడు ప్రకాశిస్తూనే ఉండడానికి కారణము సూర్యగోళములోని ఉదజని మజిలీలు మజిలీలుగా చివరకి హీలియము వాయువుగా మారుటేనని అణుశాస్త్రజ్ఞుల అభిప్రాయము. ఈరీతిగా ఖర్చై సూర్యుడు చల్లారే కాలపరిమితి ఊహకందదు.

—చిట్టిప్రశ్నలూ, పృచ్ఛకుల పేర్లూ, వారి ఊళ్లూ వేస్తూపోవడానికి ప్రస్తుతము ఈశీర్షికలో చోటుచాలదు. పేర్లు అచ్చులో చూచుకోడము కంటె సందేహాలకు జవాబు వినడమే మా చదువరుల కిష్టమని మా నమ్మిక. మా జవాబులలో ప్రశ్న ఏమిటో ధ్వనిస్తూనే వుంటుందని మా విశ్వాసము.

—త్రాచుపాము విషమును పాలలో కలిపి అత్రాచుకే పోస్తే ఎందుకు చావాలి? ఆ విషము నెత్తురులోకి ఎక్కితేనే విషమౌతుంది గాని, పాలలో కలిపి మరణాసన్నులకు పోసినప్పుడు మందే అవుతుందే? ఇంకొక ప్రాణికే అపాయకారికాని విషము ఆ పాముకి ఎట్లపాయకారి కాగలదూ? ఒక పాము ఇంకొక పామును కరచినచో, ఒక మనిషి ఇంకొక మనిషిని కరచినప్పుడు వలె అపాయము కలగవచ్చును.

—గడియారములోని *Jewels* గడియారపు మరలకు రాపిడి ఎక్కువ కాకుండా వుండుటకు బిగించినట్టివి. వీటికి లోహము వలె మెత్తదనము లేకపోవుటవల్ల త్వరగా అరిగిపోవు ఒకటీ; వేసవిలో వేడికి లోహములు వ్యాకోచించినంతగా వ్యాకోచించవు, రెండూ కారణాలు వీటిని వాడడానికి.

—చత్వారమూ, షార్టుసైటూ అన్నవి కంటిలో వుండే కటకము (*lens*) అలిసిపోయి బాగా సాగలేకపోవడమువల్లా, కావలసినంతగా కుంచించుకోలేకపోవడమువల్లా వస్తాయి. (జంతువులు చదవవూ, వాచీలు రిపేరుచెయ్యవూ, నగలమీద తీగెలు చెక్కవూ. మరి షార్టుసైటు వాటికెలాగు వస్తుందీ? చత్వారము రావచ్చును గాని ఆలోపునే ఏ దొమ్మో వచ్చి చంపేస్తుంది.

—గాలిదుమారములకు గాలి ఒక చోట ఒత్తుగా ఉండడమూ ఇంకొకచోట పలచగా వుండడమూ కారణము. వేసంగిలో వేడికి గాలి పల్చబడుతుంది. అడవులమీద ఉండే గాలికంటె రాతినేలలమీది గాలీ, ఇసక నేలలమీది గాలీ బాగా వేడెక్కి పల్చబడుతుంది. పగటి కాలములో మధ్యాహ్నము 2 గంటలకు వేడి ఎక్కువ గనక ఈవేళకి చేరువగా మూడూ, నాలుగూ గంటలకి వెచ్చబడిన గాలి పల్చనైతే దాన్ని పూటు చెయ్యడానికి అంతకంటె దట్టమైన గాలి అటు విసురుతుంది. ఈ గాలితోనే దుమారము వస్తుంది. నదీతీరాలలో గాలీ, కాలవల పొడూగునీ విసిరి పడవల తెరచాపల్నీ ఈడ్చే గాలీ, కొండలమీదికి కిందినుంచి విసిరే గాలీ, ఉష్ణభేదమువల్ల ఏర్పడినవే. ఋతుపవనాలికీ ఇదే కారణము.

—అవును అయస్కాంతము ఆకర్షించి పట్టిన మేకును విడదీయుటకన్న, ఆమేకు నేపట్టిఉంచే భూమినుండి దానిని విడదీయుట సులభమే. అయస్కాంతము మేకుకి చాలా చేరువలో వుంది. భూమియొక్క కేంద్రము ఆ మేకుకి 4000 మైళ్ళుంది. రెండింటి ఆకర్షణ శక్తి ఈ దూరముయొక్క వర్గానికి విలోమ సంబంధములో వుంటుంది. కనక ఈ దూర మెక్కువైతే శక్తి తక్కువ.

ఆకర్షణ అని అనగానే రెండింటి తత్వమూ ఒకటని అర్థము కాదు. భూమిది గురుత్వాకర్షణము. అయస్కాంతానిది లోహచుంబకత్వము. గురుత్వాకర్షణ కన్న లోహచుంబకత్వము తీవ్రము. కాని గురుత్వాకర్షణ సర్వవస్తువ్యాపి, లోహచుంబకత్వము ఇనుమూ, కోబాల్టు, నికెలు లోహాలకు మించి తీవ్రముగా నుండదు.

—సైంటిస్టులు ఇతర గ్రహాలకు వెళ్లడానికే యత్నిస్తే కాస్మికు కిరణదీప్తికి కంటె అతి నీలలోహిత (*ultraviolet*) కిరణాలకి మాడిపోవచ్చు. కాని అజాగ్రత్తగా వెళ్లరులెండి. భయము లేదు.

—కాంతియొక్క శక్తి దాని తీక్ష్ణతని బట్టి, రంగునిబట్టి వుంటుంది. మనకి ప్రకృతిలో రంగులకాంతులు లభించవు కనక తీక్ష్ణతనిబట్టి దానిశక్తిని మాచుకోవాలి. చంద్రుడికాంతి సూర్యుని కాంతికంటె చల్లన కుజునికాంతి ఇంకా చల్లన. చల్లన అంటే వేడితక్కువ అని అర్థము.

—పగలు, మెరుగుడు పురుగే అన్నమాటేమిటి, ఎలక్ట్రికు దీపాలూ, సినీమా దీపాలూ కూడా గుడ్డివెలుగే చూపుతాయి. సూర్యునివెల్తురులో పోల్చితే చిన్ని పురుగు వెలుగెంత? వెన్నెలలోనే మెరుగుడుపురుగు కొంత వెలవెలపోతుందే, ఎండలోనూ పగటి వెల్తురులోనూ లెక్కయేమిటి?

—నీటిలో ప్రసరించే కిరణాలవల్లనే చేపలు తమ యెరని చూచి తరిమి కబళించగలుగుతున్నాయి. సముద్రము లోతులలో మెరిసే చేపలుంటాయి. వీటి వెలుగుకి భ్రమసి చేరవచ్చే చిరుచేపలు వీటి కాహారమౌతాయి.

—అవును. నీలగిరి కొండలమీద పప్పు ఉడకదు. కొండలమీద గాలిఒత్తిడి తక్కువగా వుంటుంది. కనక నీటిలోంచి తప్పించుకుని ఆవిరిరూపాన్ని నీటికణాలు వచ్చేయడానికి నిరోధకమైన గాలి ఒత్తిడి తగ్గిపోయి ఉంటుం దన్నమాట. కింద మైదానాల్లోకంటె తక్కువ ఉష్ణోగ్రతవద్దనే నీరు మరిగిపోతుంది. అందువల్ల పప్పుని మెత్తబరిచేటంత ఉష్ణత నీటిలో పెరగకుండానే నీరు ఆవిరి అయిపోతుంది.

—వాతావరణ పరిస్థితులు తెలుసుకోడానికి శాస్త్రజ్ఞులు ఎగరవేసిన గాలిపటములు 9 కైలోమీటర్లుదాకా ఎగిరినవి. ఏరోప్లేనులు 12 కైలోమీటర్లూ, మానవులున్న బెలూనులు 18, మానవులు లేక శాస్త్రసాధనములే ఉన్నవి 35 కైలోమీటర్లూ ఎగిరినవి. 8 కైలోమీటర్లంటే 5 మైళ్ళు. ★



1. ధవళేశ్వరంవద్ద గండి పడగా మునిగిన ప్రాంతం



2. ఇంటి కప్పులవరకూ వరదనీటిలో
మునిగిపోయిన ఆర్యాపురం.




# నీతి గీతి

శ్రీ కామన హనమంతరావు



చిన్నారి పొన్నారి
చిట్టిపాపల్లార
చిఱునవ్వు లొలికేటి
చిన్ని పాపల్లార

ఆరుపోరులు లేక
అమ్మపెట్టే బువ్వ
ఆరగించిన పిదప
ఆటలకు చేరండి

చదువు సంధ్యలయందు
శ్రద్ధగా వుండాలి
ఆటపాటలలోను
ఆరితేరుండాలి

మీయందరకు నేను
అన్నయ్య నవుతాను
మంచి చెడ్డలు మీకు
ఎంచి చెబుతుంటాను

సందెవేళకు మీరు
ముందుగా చేరితే
చందమామను మీకు
చెలిమి కలిగిస్తాను

పెద్దవారల యెడల
బుద్ధిగా మెలగండి
మంచిబుద్ధులు నేర్చి
పెద్దమనుషులు కండి

తోటివారిలో కెల్ల
మేటివారనిపించి
దేశభక్తిని గలిగి
తెలివిగా మెలగండి

అన్నయ్య పలికేటి
ఆప్తవాక్కులపైన
ఆదరణ చూపించి
ఆచరించారంటె

ఆనందమే మీకు పాపాయిలూ
అతిశయించును మీకు పాపాయిలూ



అద్దెబోటులో-

# ముచ్చటగా ముగ్గురు

## (కుక్క సంగతి సరే సరి!)

(గతసంచిక తరువాయి)

అంతటి విపత్కర పరిస్థితిలో మేము కొట్టుమిట్టాడుతూ వుండగా దేవుడు పంపిన దూత అల్లే, చిన్న కుర్రాడొకడు ఆదారిని వచ్చాడు. వాడు ఒకచేత్తో బీరుడబ్బా పట్టుకొన్నాడు. రెండోచేత్తో ఏదో దారానికి కట్టివున్న వస్తువు పట్టుకొస్తున్నాడు. దారిలో ఎక్కడైనా ఒకరాయి కనిపిస్తే దానిమీాద కావస్తువుని విసిరి వికృతమైన చప్పుడు ఏదో పుట్టిస్తున్నాడు. వాడిచేష్టలు, ఆకారం అవీ ఎల్లావున్నా, మేమువున్న పరిస్థితుల్లో వాడు నిజంగా దేవుడు పంపిన దూత అల్లేనే అవుపించాడు. (దేవదూతలుగా రాదలచిన వారికి పిల్లల ఆకారంకంటే యోగ్యమైన ఆకారం మరేదీ లేదు) వాణ్ణి నిలబెట్టి, ఆప్రాంతంలో ఎక్కడైనా పనీపాటా లేని ముసలీ, ముతకా, అవిటీ యిల్లాంటివాళ్లు ఒంటరిగా వుండేయిళ్లు ఏమైనా వున్నాయా అని అడిగాం. (అంటే — మావుద్దేశం మరేమీా లేదు-అల్లాంటి నిస్సహాయులు ఎవరైనావుంటే వాళ్లని హడలగొట్టి అయినాసరే, ఆపూటకి వాళ్ల యిళ్లల్లో పడుకొందామని!) అదీ కాకపోతే-పాడుబడ్డ సున్నం బట్టీ చుట్టుపక్కల అయినాసరే ఎక్కడైనా వుంటే చెప్పమన్నాం. తనకైతే అల్లాంటి చోట్లు ఏవీ తెలియవనీ, అంతగా కావాలంటే వాళ్లయింటికే వస్తే వాళ్లఅమ్మని అడిగి వీలుంటే మాకాపూటకి బస ఏర్పాటు చేస్తానని ఆకుర్రాడు అన్నాడు.

మాకు అర్థాంతరంగా వచ్చిపడ్డ యీాకష్టంలో యింత చిన్నకుర్రాడు యీావిధంగా ఆదుకొంటానన్నందుకు మాముగ్గురికీ బ్రహ్మానందమై పోయింది. ముగ్గురమూా ఒక్కసారిగా వాడిమీాద పడిపోయి వాణ్ణి గట్టిగా కౌగలించేసుకొన్నాం. మాముగ్గురి బరువూ ఒక్కసారిగా ఆవేలుడు వెధవమీాద పడేసరికి, వాడు తట్టుకోలేక నేలమీాద కూలబడిపోయాడు. వాడితోపాటు మేమూా మట్టి నాకాల్సి వచ్చింది. హారిస్సుగాడికి మూర్ఛ వచ్చినంత పనికాగా, వాడు ఆకుర్రాడిచేతిలో డబ్బా అందుకొని అందులోవున్న 'బీరు' కాస్తా గడగడా తాగేశాడు. త్రాణ కొంచెం అందుకోగానే సామానంతా నన్నూ, జార్జినీ అక్కడే వదిలేసి, ఆకుర్రాడి వెనకాల పరిగెత్తాడు. నేనూా జార్జి చచ్చినట్లు బండెడు సామాను మోసుకెళ్లాం.

ఆకుర్రాడు మమ్మల్ని నాలుగుగదుల పాకకి తీసుకెళ్లాడు. వాడితల్లి చాలా మంచిది. అంత అర్థరాత్రివేళ మాకు తినటానికి ఏవో పెట్టింది. పడకగదిలో రెండే మంచాలు వున్నాయి. ఒకటి రెండున్నర అడుగులు మాత్రమే వెడల్పువుంది. దాంట్లో నేనూా జార్జి పడుకొన్నాం. ఒకరాత్రివేళ పడిపోతామేమోనని దుప్పటితో యిద్దరి నడుముల్నీ మంచం

మూలం :
జెరోమ్ కె. జెరోమ్

★

అనువాదం :
విశ్వాత్ముల నరసింహమూర్తి

#  ముచ్చటగా ముగ్గురు 

కోడుకి బిగించి కట్టేసుకొన్నాం. రెండో మంచం చిన్నపిల్లల మంచం. హారిస్సు ఒక్కడూ అందులో పడుకొన్నాడు. తెల్లారి లేచాక చూస్తే వాడికాళ్లు మంచం పట్టీల్లో నుంచి బయటికి వేళ్లాడుతున్నాయి. ఆకాళ్లనే మేము తువ్వాలలూ, తడిబట్టలూ తగిలించు కోవటానికి వుపయోగించాం.

'డాచ్చెట్' దగ్గిర అప్పట్లో మాకు జరిగిన అనుభవాలు అవీ! మళ్లా యింకోసారి మేము ఆవూరికి రావటం అంటూ సంభవిస్తే హోటళ్ల విషయంలో భేషజాలు ఏవి పోకుండా, ఎక్కడ చోటు వుంటే అక్కడే బసచెయ్యటం మంచిదని లోగడనే తీర్మానించుకొన్నాం.

ఇదివరకటి అనుభవాల మాట అటుంచి ప్రస్తుత విషయానికి వద్దాం. 'కోతుల లంక' చేరేదాక చెప్పుకో దగ్గదేమీ జరగలేదు. అక్కడ పడవకి లంగరేసి, వంట ప్రారంభించాం. కావలసిన అన్ని వస్తువులూ వున్నాయికాని, ఒక్క ఆవాలుమాత్రం తెచ్చుకోవటం మరచిపోయాం. మామూలుగా అయితే ఆవాలు నాకు అసలు అక్కరనేలేదు కాని, ఆక్షణంలో అవి దుర్లభమని తెలిసేసరికి, ఆవాలు లేకుండా అర క్షణమైనా బ్రతకలేనని పించింది. ఎవరైనా సరే అప్పటికప్పుడు ఆవాలు పుట్టించుకువస్తే అడిగిందల్లా యిచ్చేసే స్థితిలో వున్నాను: కావాలంటే యీ ప్రపంచాన్నే దానధర్మ విక్రయాది సర్వహక్కుల తోనూ రాసి యిమ్మన్నా రాసియిచ్చేశేవాణ్ణి.

ఈ విశ్వసృష్టిలో మనం వుండే భూగోళం మాదిరివి యింకెన్ని వున్నాయో నాకైతే సరిగ్గా లెక్క తెలియదుకాని, ఎన్ని వుంటే అన్నీ, (అందులో ఒక్కటైనా నాకోసం అట్టె పెట్టుకోకుండా) చెంచాడు ఆవాలకి అమ్మేసేవాణ్ణి. నాతో వచ్చిన తిప్పలు అదే:—కావాలనుకొన్నది దొరక్కపోతే నాకు యింక వొళ్లూ పై తెలియదు.

హారిస్సుది కూడా నామాదిరి తత్వమే. ఆక్షణంలో ఆవాలు తెచ్చియిచ్చినవాడికి తనూ యీ విశ్వాన్నంతటినీ ధారాదత్తం చేసేస్తానన్నాడు. తెలిపైన వాడెవడైనా అప్పటికప్పుడు ఒకడబ్బాడు ఆవాలు పట్టుకొని మాదగ్గిరకి గనక వచ్చివుంటే, జీవితాంతంవరకు హాయిగా అనుభవించేందుకు అతగాడికి ఎన్ని భూగోళాలు, నక్షత్ర మండలాలు లభించేవో కదా!

కాని — ఒక్క ప్రమాదం వుంది. నిజంగా ఎవడైనా ఆవాలుతెచ్చి చేతిలోపోస్తే, హారిస్సూ నేనూ కూడా యిందాక అనుకొన్నవన్నీ వుపసంహరించుకొని, వాడితో బేరం పెట్టేవాళ్లమే. ఆపదలో వున్నప్పుడు అందరూ మాలాగే ఏంత డబ్బైనా యిచ్చేద్దామనుకొంటారు: కాని తీరా అవసరంతీరాక ఆవస్తువు అసలు విలువకి పైన పైసాఅయినా యివ్వటానికి గింజుకొంటారు.

మొత్తానికి ఆపూట వంటలో ఆవాలు లేకుండా పోయినందువల్ల నాకు లోకమే చీకటైనట్లు అనిపించింది; బ్రతుకు దుర్భరమనిపించింది. ఏమాట మాట్లాడటానికీ మాలో ఎవ్వరికీ ఓపిక లేకుండా పోయింది.

ఇంతలో జార్జిగాడు గోనెసంచి అడుగుదాకా చెయ్యిపోనిచ్చి, అనాసపండు ముక్కలువున్న డబ్బా పైకి లాగాడు. దాన్ని చూడగానే మాకు నోరూరుంది. జీవితంపై మళ్లా అనురాగం పుట్టుకొచ్చింది.

అనాసపండు అంటే మాముగ్గురికీ వల్లమాలిన యిష్టం. ఆడబ్బా తయారుచేసినవాడెవడో మహా ఘటికుడు. అనాసపండు బొమ్మని రంగుల్లో ముద్రించి, దాన్ని డబ్బాపైన అటించాడు. ఆబొమ్మకేసి చూస్తుంటేనే, పండురసం తాగుతున్నట్టనిపించి, ఒకళ్లనొకళ్లం చూసి చిరునవ్వులు నవ్వుకొన్నాం. హారిస్సు అప్పుడే చెంచా పైకి తీసి, సిద్ధంగా కూర్చున్నాడు.

డబ్బా మూత తీయటానికి పనిముట్టుకోసం వెదికాం. గోనెసంచి అంతా గాలించినా అది కనిపించలేదు. చేతిసంచులన్నీ తిరగతోడాం: పడవనంతా బోర్లించి చూశాం; ఎక్కడైనా ఆపనిముట్టు కనిపిస్తుందేమోనని. ఊహూ! కనిపించలేదు.

తన దగ్గిర చిన్నచాకు ఒకటి వుంటే, దాంతో

మూత తియ్యాలని హారిస్సు ప్రయత్నించాడు. డబ్బామూత తియ్యలేకపోవటం మాట అటుంచి, చాకు విరగ్గొట్టుకొని కాళ్లూ చేతులూ కోసుకొని ఒక పక్కకి తప్పుకొన్నాడు. జార్జి ఒకకత్తెర పట్టుకొచ్చి, దాని మొనతో డబ్బామూత తీయబోయాడు. డబ్బామూతమీద పెట్టి కొట్టుతుండగా, కత్తెర అమాంతం ఎగిరి అంతదూరాన పడింది. ఇంకా నయం-కొద్దలో తప్పింది — లేకపోతే ఆరోజు వాడి కుడికన్ను ఎగిరిపోవాల్సిందే! వాళ్లిద్దరూ ఒక మూలకి పోయి గాయాలకి కట్లు కట్టుకొంటూ కూర్చున్నారు. గడకర్ర మొనతో డబ్బాకి చిల్లి పొడవాలని నేను ప్రయత్నం చేశాను. అంతపొడుగు కర్రని పైకిఎత్తి, గురిచూసి సరిగా డబ్బామీద పడేలా విసురుగా దించాను. కాని, నాఅంచనా ఏదో తప్పిపోయి, ఆ విసురికి డబ్బా చిల్లి పడవలిసిందిపోయి, నేనే ఎగిసి మొలలోతు మురికినీళ్లల్లో విరుచుకు పడ్డాను. డబ్బా దొర్లుకొంటూపోయి మూలగా పడివున్న టీకప్పు నొకదాన్ని పప్పుపప్పు కింద చితక కొట్టేసింది.

ఆ పరాభవంతో మాముగ్గురికీ వొళ్లు మండుకు వచ్చింది. ముగ్గురమూ కలిసి ఆ వెధవ డబ్బాని గట్టుమీదికి పట్టుకెళ్లాం. హారిస్సు పక్క పొలంలోకి వెళ్లి, పెద్ద రాతిబండ పట్టుకొచ్చాడు. నేను పడవలోకి వెళ్లి తెరచాపకొయ్య వూడదీసి మోసుకొచ్చాను. జార్జిగాడు డబ్బాని కదలకుండా పట్టుకొన్నాడు: హారిస్సు దానిమీద బండరాతి మొన ఆనించి పట్టుకొన్నాడు. నేనా తెరచాపకొయ్య బలంగా పైకిఎత్తి, సరిగ్గా గురిచూసి కిందికి వదిలేశాను

జార్జిగాడి గడ్డిటోపీ నిజంగా ఆరోజు వాడి ప్రాణం కాపాడింది. (వాడు యీరోజుకీ దాని తాలూకు జీర్ణభాగాలను అతి పదిలంగా అట్టే పెట్టుకొని, అందరికీ చూపించి, అదంతా ఒక పెద్ద కథగా చెప్పుతూవుంటాడు.) హారిస్సుకి వొళ్లు గీసుకుపోయింది. వాళ్లిద్దరితో పెట్టుకొంటే యిక లాభం లేదని నేనొక్కణ్ణే ఆ డబ్బామీద, చేతులు చచ్చుపడి పోయేదాకా, తెరచాపకొయ్యతో బాదేశాను. నా చేతుల్లో సత్తువ సాంతం తగ్గిపోయాక, హారిస్సు అందుకొన్నాడు.

ఇద్దరమూ కలిసి గుండ్రంగావున్న డబ్బాని ముందు అప్పడంలా అణిచేశాం. తరువాత నలుచదరంగా కోవాబిళ్లలా తయారుచేశాం. ఆతరువాత ముక్కోణాకారంగా తేల్చాం. ఈవిధంగా రేఖాగణిత శాస్త్రజ్ఞులు వూహించగలిగిన అన్ని ఆకారాలు మొత్తంమీద మా డబ్బాకి తెప్పించకలిగాం. ఇన్ని చేయగలిగాం కానీ, ఆ వెధవ డబ్బాకి కన్నం మాత్రం పొడవలేక పోయాం. అప్పటికి జార్జికి రోషం వచ్చేసింది. హారిస్సు చేతిలోవున్న తెరచాపకొయ్య తాను అందిపుచ్చుకొని గట్టిగా ఒకదెబ్బ వేశాడు. ఆదెబ్బతో డబ్బాకి ఏదో దెయ్యపు తల ఆకారం వచ్చింది. ఆ ఆకారాన్ని చూసి జార్జిగాడు జడుసుకొని, తెరచాపకొయ్యని జారవిడిచేశాడు. ముగ్గురమూ దానిచుట్టూ గడ్డిమీద కూలబడిపోయి, దానివంక గుడ్లు అప్పగించి చూస్తూ వుండిపోయాం.

డబ్బాకి పైభాగాన అడ్డంగా ఒక పెద్దసొట్ట పడింది. ఆ సొట్టవంక చూస్తుంటే యీసిగ్గుమాలిన డబ్బా మమ్మల్ని చూసి ఎగతాళిగా నవ్వుతున్నట్లు అనిపించింది. మా వొంటికి కారం రాసినట్లు అయింది. హారిస్సు ఆగలేక డబ్బాని విసిరిపుచ్చుకు నది నట్టనడానికి గిరాటువేశాడు. అది పెద్దచప్పుడు చేసుకొంటూ నీళ్లల్లో మునిగిపోయింది. ఆ చప్పుడుకి మా తిట్లు జతచేసి, వెనక్కి అయినా తిరిగి చూడకుండా వచ్చి పడవలోకి ఎక్కి ప్రయాణం సాగించాం. 'మెయిడెన్ హెడ్' చేరే దాకా ఎక్కడా ఆగకుండా పడవ నడిపేశాం,

నేను చుక్కాని తిప్పుతున్నాను.

అసలు నదిమీద ప్రయాణంలోనే ఆ అందం వుంది. కేవలం కలలోతప్ప యితరత్ర సాధ్యంగాని అనుభూతి, ఆనందం ఏదో నదిమీద యిలా తేలితేలి పోతున్నప్పుడు కలుగుతుంది. పడవలో ప్రయాణం చేస్తున్నంతసేపు మిమ్మల్ని ప్రకృతిమాత తన గుండెలకి హత్తుకొంటున్నంత హాయిగా వుంటుంది. పిల్లగాలులు మన చెవిలో దూరి ఏవేవో సన్నగా యీలపాటలు ఏలపాటలు పాడుతాయి. మేఘమాలికలు మన మెడలచుట్టూ పెనవేసుకొని మనల్ని ఆత్మీయులను పలకరించినట్లు పలకరిస్తాయి.

అదేమి చిత్రమో ఆరోజు మేము ఎంతదూరం ప్రయాణంచేసినా, ఎక్కడా యింకో పడవ కనిపించలేదు. చివరికెప్పుడో దూరంగా చేపలు పట్టేవాళ్ల



శుష్క వృక్షం

—ఫోటో: శ్రీ పి. ఆర్. జోసేపల్లి, రేపల్లె.

# ★ ముచ్చటగా ముగ్గురు ★

పడవఒకటి కనిపించింది. మాపడవని దానిదగ్గిరకి పోనిచ్చాం. ఆ పడవమీద ఎవ్వరో ముగ్గురు కూర్చుని చేపలు పట్టుతున్నారు. మాపడవ వాళ్ల పడవని పొరుసుకొనేటంతగా దగ్గిరకొచ్చినా వాళ్లు ఏమీ మాట్లాడలేదు.

చుక్కాని నేనే తిప్పుతున్నాను.

వాళ్లు ముగ్గురూ ముసలివాళ్లలాగే, మంచివాళ్లలాగే అపుపించారు. ముగ్గురూ పడవలోనే మూడు కుర్చీల్లాంటివి ఏవో వేసుకొని వాటిమీద కూర్చున్నారు. నీటిలోకి గాలాలువేసి వాటివంకే తదేకంగా చూస్తూన్నారు.

అస్తమిస్తున్న సూర్యుడి తాలూకు అరుణ కాంతులు నది జలాలమీద చిత్ర. విచిత్రమైన రంగులను వెదజల్లుతున్నాయి. అలాంటి వాతావరణంలో మేము ముగ్గరమూ కూడా అతిలోక సుందరీమణుల్లోకి ఆనందాన్ని ఐశ్వర్యాన్ని అన్వేషించుకొంటూ పోతూన్న రాజకుమారుల్లా వెలిగిపోతున్నాం.

ఇంతలో ఏం జరిగిందో ఏమో వెంటనే మాకైతే బోధపడలేదు కాని, ముగ్గరమూ ఒక్కసారిగాపోయి ఆ చేపలు పట్టుతున్న వాళ్ల పడవలో పడిపోయాం. మేము వచ్చిపడిన వుదుటికి ముసలాళ్లు ముగ్గురికీ స్థానభ్రంశం కలిగింది: ముగ్గురూ మడతలు పడిపోయి పడవ నట్టనడానికి కొట్టుకొచ్చారు. ఒకళ్లనొకళ్లు పెనవేసుకు పోయినందువల్ల, ఎవళ్లకి వాళ్లు విడదీసుకు వూడిపడటానికి కొంతసేపు పట్టింది. అంతసేపూ వాళ్లు మమ్మల్ని నానాబూతులు తిట్టారు. తెరచాప



హాస్య మానసం

ఫోటో: శ్రీ టి. వి. సత్యనాథరావు, నెల్లూరు.

ఎత్తటంసరిగా చేతగాని మాలాంటి వాళ్ళకి, మమ్మల్ని కన్నవాళ్ళకీ, మా కడుపున పుట్టినవాళ్ళకీ యీలోకంలోనూ పైలోకంలోనూ కూడా పుట్టగతులు వుండబోవని శాపాలు పెట్టాడు.

మూగమొద్దుల్లా కాలం గడుపుతున్న ఆ ముసలాళ్ళల్లో కొంత చైతన్యం కలిగించినందుకు మమ్మల్ని మెచ్చుకోవలసిందిపోయి, అవరసని పడేసి తిట్టుతున్నందుకు హారిస్‌కి కష్టం వేసింది. అదీగాక, అంతవయస్సు వచ్చిన మనుష్యులు కూడా యింత పెద్ద బూతులు మాట్లాడుతూ వుంటే వినటానికి తనకే చిన్నతంగా వున్నదని తెగ నొచ్చుకొన్నాడు. ఈధోరణిలో వాడు ఎంత వాదించినా వాళ్లు అదేమీ వినిపించుకోలేదు.

ఇంత జరిగాక, చుక్కాని తను తిప్పుతానని జార్జి అన్నాడు. నాలాంటి తలతిరుగుడు తత్వంగల మనిషి ఎన్నడూ చుక్కానిదగ్గర కూర్చోకూడదని—కొత్తగా ఒక గొప్పసూత్రం కనిపెట్టినట్లు—అన్నాడు.

పడవ ఏ ప్రమాదమూ లేకుండా 'మార్లో'దాకా వెళ్లింది. అక్కడ చేరాక బ్రిడ్జిదగ్గిరే పడవని కట్టేసి వూళ్లోకి వెళ్లి ఆరాత్రి ఒక హోటల్లో బసచేశాం.

(ఇంకావుంది)

# కొన్నగేదె

"ఏమండీ ఏమైంది? వెళ్ళినపని పూర్తిఅయినట్లేనా?" అనడిగింది జానికమ్మగారు, అప్పుడే ఆయాసపడుతూ ఎండలో ఇంటికి వచ్చిన భర్తని చూచి.

"ఆ... చెప్తా... కొంచెం చల్లని మంచి నీళ్ళియ్యి ముందు. నాలిక పిడచకట్టుకు పోతోంది" అన్నాడు భర్త రామశేషయ్యగారు. జానికమ్మగారు యింట్లోకి వెళ్ళింది మంచినీళ్లు తేవడానికి—

"వెధవ ఎండలు మరీ విపరీతంగా వున్నయ్. బయటకు వెళ్లటం అంటే భయం వేస్తోంది. కాని వెళ్లక తప్పటంలేదు. ఆపట్నాల్లో అయితే అవేవో గదులుంటాయిట. ఎప్పుడూ చల్లగానే వుంటాయట- అక్కడ కూర్చుని వుండుం" అని తనలో తానే విసుక్కుంటున్నాడు రామశేషయ్యగారు, ఎండలో వచ్చిన తపనయింకా తీరక. మంచి నీళ్లు తీసుకొస్తూ భర్తమాటలు విని జానికమ్మగారు అందుకొంది- "ఆ...ఇహ! అదొకటే మన మొఖాలకి తక్కువ. చల్లటి గదులుంటాయ్‌ట-గదులు - పల్లెటూళ్లో వుంటూ కమ్మటి మజ్జిగ తాగటానికైనా పెట్టిపుట్టలేదు. బస్తీల్లో వెళ్లి వుందామని కలలు గంటున్నారు. పాపం" అంటూ సాగదీస్తూ వచ్చి మరచెంబు భర్తచేతి కందించింది.

"ఇంతకీ వెళ్ళిన పనేమయిందో చెప్పారు కారేం"

"చెప్తానుండు మరి తొందర పడితే ఎలా!" అంటూ ఖాళీ మర చెంబు కిందపెట్టి మొదలెట్టాడు చెప్పటం "మొత్తానికి సాధించాననుకో - మనం కావాలనుకున్న గేదె-అంటే నువ్వు కోరుకున్న హంగులుఅన్నీ వున్న గేదె-చివరకి ఒకటి దొరికింది బయానా గూడ యిచ్చి వచ్చాను."

"బయానాగూడ యిచ్చారూ! నల్లగా నిగనిగలాడుతోందా గేదె?

**శ్రీ సి. వి. నారాయణమూర్తి**

కొరకొమ్ములేనా? పాలు బాగా యిచ్చేదేనా? నెయ్యి పూటకి ఎంతొస్తుందో?" అంటూ ప్రశ్న మీద ప్రశ్న కురిపించేసింది జానికమ్మగారు, సంతోషం పట్టలేక.

"ఆ ... నువ్వు కోరుకున్న హంగులన్నీ వున్నయ్ పూటకి రెండుశేర్లు పాలిస్తుంది. నెయ్యి అరసోలెడవుతుంది. అయితే ధర కొంచెం ఎక్కువే ననుకో-..."

"ఎంతేమిటి?"

"అబ్బే-ఎంత ... రెండు పచ్చ కాగితాలు" అంటూ నసుగుతూనే చెప్పాడు అప్పటికీ ఒకపాతిక తగ్గించే-భార్యా రత్నం ఏమంటుందోనని.

"పోతే పోయినయ్ లెండి ముష్టి రెండువందలు. డబ్బు మనం సంపాదించామా? మన్ని డబ్బు సంపాదించిందా? కావాలంటే మళ్లీ రేపీపాటికి సంపాదించచ్చు - మనం కోరుకున్న గేదె వచ్చింది. అంతే చాలు - అయితే ఎప్పుడు తోలుకొస్తారు"

"ఎల్లుండి మంగళవారం మంచిది పశువుల్ని తోలుకురావడానికి. ఆరోజే తోలుకొస్తాను"

"అయితే ఈలోగానే మంచి యిత్తడి చెంబుఒకటి చేయించండి- కాస్త పెద్దదే చేయించండి, మన మేపులో యింకాపాలు ఎక్కువ అవుతయ్ గూడను."

పాపం-జానికమ్మగారికి ఎన్నాళ్ళనుంచో మనసు. చక్కటి గేదెనొకదాన్ని కొందామని. కొన్న మజ్జిగ తాగలేక విసుగొస్తోంది. అన్నిటికంటె పక్కింటి రాజమ్మగారు రోజూ దొడ్లోనుంచి పాలచెంబు పట్టుకెళ్తూ వయ్యారంగా, అహంభావంతో నవ్వుతూంటె అరికాలి మంట నెత్తికెక్కేది!! మహా! ఈవిడికే గేదె వుందేం! రేపీపాటికి నేను అంతకంటే మంచి గేదెను కొని దొడ్లో కట్టేయించలేకపోతే గద! అప్పుడుగాని ఈవిడ పొగరు అణగదు" అని అనుకుంటూ భర్త రామశేషయ్య

గార్ని ఈ రెండు నెలలనుంచి వూపిరాడకుండా వూళ్లవెంట తిప్పుతోంది. తిరిగి తిరిగి రామశేషయ్యగారికి విసుగుపుట్టిందే గాని తమకు నచ్చిన గేదె దొరకలేదు - పాపం ఈసారి కూడ విసుక్కుంటూనే గత్యంతరం లేక వెళ్లాడు ప్రక్కనే మూడు క్రోసుల దూరంలో వన్న పాలెం. ఇంక అక్కడ గేదెను చూచిన తరువాత వదల బుద్ధయింది కాదు; అదీకాక యింకతిరగటానికి గూడ వోపిక లేదు. అందుకనే కాస్త ధర ప్రియమైనా బయానా యిచ్చి వచ్చాడు—

మంగళ వారం ప్రొద్దున్నే వర్జ్యం లేకుండా చూచి బయలుదేరి పాలెం వెళ్లాడు రామశేషయ్యగారు, రెండు వందలు చేత బుచ్చుకొని. ఇక్కడ జానికమ్మగారు ముందు పక్కింటి రాజమ్మగారితోనే చెప్పింది, తమగేదెను గురించి. ఆవిడ "అలాగా" అని వూరుకొంది. ఇంక మధ్యాహ్నం అయ్యేసరికల్లా ఆవీధిలో వాళ్లందరికీ చెప్పేసింది. సంతోషించిన వాళ్లు సంతోషించారు, విసుక్కునే వాళ్లు విసుక్కున్నారు. "ఆవిడ గేదెను గురించి మనతో చెప్పతుంది దేనికీ" అని. అవన్నీ ఆవిడ పట్టించుకొనే మనిషి కాదు. చెప్పడం వరకే ఆవిడపని.

సాయంత్రానికల్లా గేదెను తోలుకొచ్చాడు రామశేషయ్యగారు. దానికింత దిష్టితీసి పాకేసి దొడ్లో కట్టేయించింది. కొత్తగా చేయించిన పాల చెంబుతో ఆపూటే తన స్వహస్తాలతో ప్రారంభోత్సవం జరిపింది జానికమ్మగారు.

రామశేషయ్యగారి పని పూర్తి అయి తెరిపినిబడ్డారు గాని, గేదె వచ్చిన దగ్గరనుంచి జానికమ్మగారికి క్షణం తీరిక లేదు. దానికి సరిగ్గా మేత అమురుతుందో లేదో చూడ్డం' వేళకి చిట్టుతవుడుపోసి నీళ్లు పెట్టడం రెండుపూటలూ పాలు తీయడం



జానికమ్మగారికి కోపం ఆగక ముందు దీనికి బుద్ధిచెప్పి తర్వాత భర్తకు బుద్ధి చెప్దామని కఱ్ఱ తీసుకుని నడ్డి విరిగేటట్లు ఒక్కటి పెటింది.

# ★ కొత్త గేదె ★

లాంటి పనుల్లో మునిగి తేలుతోంది. ఇప్పుడు ప్రక్కింటి రాజమ్మగారికంటే దర్జాగా నడుస్తుంది- ఆమెకేగాదు తమకీ ఒక గేదెమంచిదే వున్నదన్న భావంతో—

వారంరోజులు గడిచాయి. గేదె బాగా కండబట్టి పాలుగూడా జాస్తిగానే యిస్తోంది. యింతలోకే జానకమ్మగారి పుట్టింటినుంచి వుత్తరం వచ్చింది, మేనల్లుడు బారసాలకు రమ్మని కోరుతూ. పాపం వెళ్లక తప్పేటట్లులేదు. ఈగేదెను, పాడిని వదిలి వెళ్లాలంటే కష్టంగానే వుంది. అదీగాకుండా అదివచ్చిన దగ్గరనుండి పాలుతానే తీస్తోంది, భర్త తీస్తానన్నా వినకుండా. మళ్లీ యింకొకళ్ల కిస్తుందో యివ్వదోనన్న అనుమానం. చివరకు వెళ్లక తప్పక వెడుతూ "గేదె జాగ్రత్తండోయ్. మళ్లీ నేవెంటనే వచ్చేస్తాను లెండి: కొంచెం పాలు కనిపెట్టి తియ్యండి. పాలు యివ్వకపోతే ముందు కాస్త చిట్టో పొట్టో పెట్టి తియ్యండి. వదిలేశారంటే అసలు సాంతం ఎగ్గొడుతుంది" అని యిట్లాంటి హెచ్చరికలు చేసి మరీ వెళ్ళింది.

ఇంక గేదె బాధ్యతంతా రామశేషయ్యగారి నెత్తినే పడ్డది. జానకమ్మగారు వూరికెళ్ళిన మర్నాడు ప్రొద్దున్నే పాలచెంబు తీసుకొని బయలుదేరాడు. పాలు తీయడానికి సంసిద్ధుడై కూర్చుండేటప్పటికి గేదె బెదురు చూపులు చూస్తూ కొంచెం గల్లంతు మొదలెట్టింది. దీనికి కొంచెం లంచం పెట్టందే పాలివ్వదని లోపలికి వెళ్ళి తవుడుబుట్ట తీసుకొచ్చి ముందుపెట్టి కూర్చున్నాడు మళ్ళీ పాలు పితకడానికి. గేదెమాత్రం తింటంలో లోపం చెయ్యలేదు. ఈయన పితకడం ప్రారంభించేసరికి గేదె తింటం మానేసి ఈయన వంక చూసి కొంచెం గల్లంతుచేసి ఒక్కతన్ను తన్నింది. ఆ దెబ్బతో రామశేషయ్యగారి పళ్లు పూడి కింద పడవలసిందేకాని, అదృష్టవశాత్తు ఆదెబ్బ చెంబుకు తగిలి వెళ్ళి కాస్తంత దూరంలో పడ్డది. ఇంక లాభం లేదని ఆపూటకి వదిలేసి యింట్లోకి వెళ్ళాడు. ఆరాత్రికి గూడా పాలు తియడం మానుకున్నాడు, ప్రొద్దున్న తిన్నదెబ్బ గుర్తుకొచ్చి—

కాని పడుకుంటే ఎంతకీ నిద్దరొచ్చిందికాదు. వెధవ గేదె. రెండువందలు పైచిలుకు పెట్టి కొన్నానే! పాలు యివ్వకుండా ఎగ్గొడుతున్నదేమిటీ! రోజూ భార్యా రత్నం గూడ యింత అవస్థ పడుతోందా పాలు తీయడానికి, అని అనుమానం గూడ వేసింది. అబ్బే! యింత అవస్థ రోజూ ఆమెకు గూడ వుంటే ఎప్పుడో అమ్మివెయ్యమనేది. ఆమెకి దీనికిటుకేమిటో తెలుసు. అని తనలో తాను సమర్థించుకున్నాడు. యింక ఈవిధంగా వదిలేస్తే అలవాటుతప్పి అసలు పాలు ఎగ్గొడుతుందేమో! ఇంక ఆవిడగారికీసంగతి తెలిస్తే, చివరకు పాలు గూడ తీయలేనంత అసమర్థుడికిందజమకట్టి వేళాకోళం చేస్తుంది- యింక ఏదో విధంగా రేపు ప్రొద్దున పాలు తీయాలని నిశ్చయం చేసుకున్నాడు.

ప్రొద్దున్నే కొంచెం మసక చీకటి వుండగానే లేచి ప్రక్కనే దండెంమీద వేసివున్న వుత్తరీయం కప్పుకున్నాడు, కొంచెం చలిగావుంటేను. వెళ్ళి పాలచెంబు తీసుకుని గేదెదగ్గర కూర్చున్నాడు. గేదె ముట్టితో వాసన చూచి గోల చెయ్యకుండా పాలు తీయ

---

బుజ్జాయి తన కొత్తసైకిలు మీద ప్రజ్ఞ చూపిస్తున్నాడు. ఒకమాటు రోడ్డు మీదికి పోనిచ్చి, వెనక్కివస్తూ బుల్లి చేతులు కొట్టి ముద్దుగా అన్నాడు: "అమ్మా నాన్నా, చేతులేవీ!"

"ఆఁ ఆఁ! జాగ్రత్తనాయనా దెబ్బలు తగిలించుకుంటావ్!"

బుజ్జాయి పువ్వుల నవ్వు నవ్వి మళ్లా ఒక "ట్రిప్పు" కొట్టివచ్చి అరిచాడు "ఏమేవ్: చూడు చూడు; కాళ్లులేవు!"

"బుజ్జిబాబూ, దెబ్బ తగిలించుకుంటావు నాయనా!"

మనవాడు మళ్లీపోయి కొంచెం ఆలస్యంగా తిరిగి వచ్చి, అట్లాగే కేక వేశాడు, కానీ అంత హుషారుగా లేదు మాట:

"అమ్మా చూడు, పళ్లు లేవే!"

—శ్రీ పి. నరసింహాచార్య, బందరు

---

నిచ్చింది. రామశేషయ్యగారి ఆనందానికి మేర లేదు. పాలు తీయడం పూర్తి అయ్యేటప్పటికి తెల్లవారిపోతూంది. పాల చెంబు చేత్తో పుచ్చుకుని యింక లేద్దామనుకునేటప్పటికి, ప్రక్కింటి రామావధాన్లుగారు "రామశేషయ్యా లేడా అమ్మాయ్" అంటూ వచ్చాడు. రామశేషయ్య ఆశ్చర్యపోయాడు-తను ఎదురుగ్గా వుండగా రామశేషయ్య ఏడీ అని అడుగుతాడేమని! రామావధాని దగ్గరకొచ్చి "నువ్వేనటోయ్ చీరె చూసి మీ ఆవిడేమో ననుకున్నాను చీరె కప్పావేమిటి పైన" అనడిగాడు. అప్పుడు తెల్సుకున్నాడు రామశేషయ్య, తను వుత్తరీయానికి బదులు చీరె కప్పుకున్నానని——యింక జరిగిందంతా స్నేహితునితో చెప్పేడు, దాపరికం లేకుండా! ఆవ్వాళ ఎందుకనో పాలుకూడ ఇచ్చిందన్నాడు. అప్పుడు నవ్వుతూ చెప్పాడు రామావధాని, కొన్ని గేదెలు పాలు ఆడవాళ్లు తీసే అలవాటువుంటే మగవాళ్ళకు యివ్వవని, యివాళ ఆ చీర పైనలేకపోతే నిన్న జరిగిన ప్రాయశ్చిత్తం మళ్ళీ తప్పేది గాదనీని.

ఇంక ఆ రోజునుంచి పైన చీరె శుభ్రంగా కప్పుకొని, నెత్తిన ముసుగుకూడ వేసుకొని పాలు తీయడం మొదలెట్టాడు. తను పొరపాటున కప్పుకున్న చీరె చివరకు తనకు వరప్రసాదమైనందుకు చాల ఆనంధపడ్డాడు.

జానికమ్మగారు వెళ్ళిన పదవనాడు ప్రొద్దున్నే, యింకా మసక చీకటి వుండంగానే మామూలుగా చీరె ముత్తం కప్పుకొని నెత్తినిగూడ ముసుగు వేసుకొని పాలు తీస్తున్నాడు రామశేషయ్యగారు. ఇంతలో వూరినుంచి అప్పుడే వచ్చిన జానికమ్మగారు యింట్లో భర్త లేకపోవడం చూచి దొడ్లోకి వచ్చింది. అక్కడినుండి చూచేటప్పటికి, తన కళ్ళను తనే నమ్మలేకపోయింది. తను లేనిసమయంలో పరాయి ముండను ఎవత్తెనో తీసుకొచ్చి, పైగా తన చీరెలు గూడ యిచ్చి, భర్త యింట్లోనే పెట్టుకున్నాడని ఆలోచన పోయేసరికి, ఆగ్రహం పట్టలేకపోయింది జానికమ్మగారు. అసలీ గొడవలోనే లేడు రామశేషయ్యగారు. ప్రక్కకి కదిత్తే తన ముఖం గేదె ఎక్కడ చూచిపోతుందోనన్న గొడవలో కదలకుండా కూర్చుని పాలుతీస్తూ ఆనందంలో మునిగి తేలుతున్నాడు.

జానికమ్మగార్కి కోపం ఆగలేదు. ముందు దీనికి బుద్ధిచెప్పి, తర్వాత భర్తకు బుద్ధి చెప్తామని ప్రక్కనే మడిబట్ట లారవేసుకొనే కర్ర తీసుకొని నరాసరి వెళ్లి ఏమీ ఆలోచించకుండా నడ్డివిరిగేటట్టు ఒక్కటి పెట్టింది వీపుమీద. "నే లేనప్పుడు యింట్లో వుండి కులుకుతున్నావా!" అంటూ——

"ఆ...ఎవరూ..."అంటూ వెల్లికిలా పడ్డాడు రామశేషయ్యగారు. పాలచెంబు నాల్గుగజాల అవతల పడ్డది. ఈ కంగారుకు గేదెకూడా తన విధి తను నెరవేర్చుకుంది, ఒక్క తన్నుతో. - వెల్లికిలాపడ్డ రామశేషయ్యగారి మొఖంచూచి కంగారుపడ్డది జానికమ్మగారు. యింత అభాసు పని చేశానేమిటా అనుకుంది పాపం ఆ యిల్లాలు. సాయంపట్టి యింట్లోకి తీసుకువెళ్ళి మంచం మీద పడుకోపెట్టింది. జరిగిందంతా తెల్సుకునేటప్పటికి విచారం నవ్వూ రెండూ కల్గినై జానికమ్మగార్కి. రామశేషయ్యగారి నడుంకి సున్నంపట్లు పోయి మామూలు స్థితికి వచ్చేసరికి నెలరోజులు పట్టింది. అక్కడ కాయగాచిపోయింది శరీరం. ఆ కాయను చూచినప్పుడల్లా తన ప్రతాపం తన భార్య పరాక్రమం గుర్తుకొచ్చినప్పటికీ, ఎవరైనా కాయేమిటని అడిగితే మాత్రం స్నానంచేస్తూ కాలుజారి పడ్డానని చెప్పుతుంటాడు రామశేషయ్యగారు. ★

---

"డాక్టరుగారూ! నా భార్యకు వెఱ్ఱెక్కుతుందేమో నని భయంగా వుందండీ"

"ఏం?

"ఒక గొఱ్ఱెను కొనుక్కోవాలంటూం దండీ!"

"కొనుక్కోనీండి!!"

"మరైతే దాన్ని ఇంట్లోనే వుంచుతుందిట!"

"సరే, అలాగే చెయ్యనీండి!"

"బాగానే వుంది; గొఱ్ఱె కంపు కొట్టదూ!"

"అయితే కిటికీలు తెరవండి"

"ఏంటిటీ! నా పిచ్చికలూ, పావురాళ్ళు బయటికి వదులుకోనా !!!"

—శ్రీ పి. నరసింహాచార్య, బందరు.

# దొంగా! దొరా!

శ్రీ తాడేపల్లి నరసింహమూర్తి

అప్పుడు నాకు పదేండ్లు. హోటేలులో టిఫిన్ తీసుకొని (అలవాటు లేక కాఫీ తీసుకోలేదు) బిల్లు చెల్లించటానికి హోటేలు యజమాని దగ్గరకు రాగానే వెనక నుంచి ఒక కేక వినిపించింది.

"ఒరే ఇట్రారా"

నేను అదిరిపోయినా. ఆకంఠ స్వరాన్ని నేనెక్కడా విన్నట్టు కూడా లేదు. బెరుకు బెరుకుగా వెనక్కు తిరిగి చూశాను. ఒకాయన సిల్కులాల్చీ గ్లాస్కోపంచె తొడుక్కొని హోటేలు కుర్చీ (చేతులు లేని కుర్చీ) లో కూర్చొని వున్నాడు. వీపు ఆనించే చోట చెయ్యివేసి కళ్లకు తగిలించిన ఆ పలకల అద్దాలజోడులోనించి నన్ను చూస్తున్నాడు.

ఆయన 'రావేరా' అని చెయివూపేసరికి భయపడుతూనే ఆయన వద్దకు నడిచాను. "నన్ను గుర్తుపట్టలేదట్రా" అన్నాడాయన. నేను కిక్కురుమనకుండా ప్రక్కకుర్చీలో కూలబడ్డాను.

"ఏం...హోటళ్లకు కూడా తిరుగుతున్నావేంట్రా?...పదేళ్లు లేవు...అప్పుడే హోటళ్లకా మీ నాన్నతో చెప్తానుండు. ఎంతెత్తుకొచ్చావురా" అన్నాడు నన్ను గదమాయిస్తూ.

"నేనేమి ఎత్తుకురాలేదు. నాకు అర్ధరూపాయి దొరికింది" అన్నా నేను బిక్కమొహంతో.

"ఏం తిన్నావురా" అన్నాడు మళ్లా తన చూపునేమాత్రము మార్చకుండా (అద్దాలపైనుంచి చూస్తూ...) "పావలా"

"ఏదీ మిగతపావలా ఇటివ్వు. నేను మీనాన్నకిస్తాలే. ఒకగంటాగి మీఇంటికొస్తా ...పో..." నేను మాట్లాడకుండా పావలా ఆయన జాపిన చేతిలోపెట్టి బయటికొచ్చా బిల్లు చెల్లించిన తరువాత.

* * *

అది వేసవికాలం. ఆరోజున బాగా ఎండకాస్తోంది. నేను నా చిన్నగొడుగుతో, ముద్దు చెప్పులతో-ముద్దు పెట్టుకోలేదనుకోండి-పోస్టులో కార్డు వేసిరావటానికి బయలుదేరాను. పోస్టులో కార్డు వేసి తిరిగి వస్తున్నా.

రోడ్డుమీద జనమంతగా లేరు. అక్కడక్కడ బళ్లు, మనుషులు కన్పిస్తున్నారు. నేనెందుకో క్రిందకు చూచాను-ఎందుకో నాకే తెలియదు. ఏమిటో నాకళ్లముందర మెరుస్తున్నట్లు నాకళ్లు చెప్పాయి దబుక్కున చెయివేశా దానిమీద, తియటానికి. నాజేబులో వున్న పెన్సిలు నాచేతిమీద, పడ్డది. ఆశ్చర్యం! అది ఒక అర్ధరూపాయి. నాకంతకు పూర్వము డబ్బంటూ ఏమీ దొరకలేదు. అందుకనే ఆశ్చర్యం. గోపిగాడికి మొన్న అర్ధణా దొరికింది. వెధవ ... కొనుక్కొని ఎవడికీ పెట్టకుండా తిన్నాడు... నేను కూడా ఎవరికీ పెట్టను... నే నొక్కడ్నే పోయి కొనుక్కుంటా సాయంకాలము...అమ్మో! సాయంకాలము చాలామంది ఆదారినే పోతుంటారు. ఎవరో ఒకరు చూస్తారు. మా నాన్న నాతో చెప్తారు. ఆయన తంతారు. మొన్న మాతమ్ముడు ఇంట్లోంచి అర్ధణా ఎత్తుకుపోయి కారపుబూంది కొనుక్కు తింటుంటే మానాన్నగారు కను క్కొని ఎట్లా కొట్టారు ...అబ్బ! నాకే ఏడుపొచ్చింది. అయినా నేను ఎత్తుకుపోలేదుగా ... నాకు దొరికింది! ... అమ్మో! కిట్టిగాడి కెంత ధైర్యము. మొన్న ఆ మామిడి తోటలోంచి మామిడికాయ తెచ్చుకొచ్చాడు దొంగతనంగా ...వాడు నేను కలిసిపోతేనో?...వద్దు...వాడి దగ్గర మాటరాదు. మర్నాడే అందరితో చెప్తాడు. నేనొక్కడ్నే పోతా...

కారపుబూంది [illegible] తింటే బాగానే ఉంటుంది. కాని వెధవది దాన్ని నూనెలో తయారు

చేస్తారు. అందుకనేగా మానాన్న గారు నాకు డబ్బు లివ్వకుండా తనే నాకు ఏదికావాలంటే అది కొనుక్కొని వచ్చి పెడ్తారు-కాని మానాన్నగారు నాకు పండ్లు, బిళ్లలు...ఇటువంటివి తప్ప కారపు బూందిఅటువంటివి కొనుక్కురారుగా. వాటిని నూనెతో చేస్తారు. అవి కొనగూడదు. అయినా కారపు బూందికొట్టు బజార్లోనే వుంది మరీను. నేను కొంటుంటే చూస్తారందరూ. చక్కగా కాఫీహోటేలు లోపలికిపోయి కూర్చుంటే బజార్లో వాళ్లెవరూ నన్ను చూడరు. అయినా కాఫీ హోటేలు లోపలికి గూడా జనమొస్తారుగా. అవును రోయి! చక్కగా ఆరోడ్డు మలుపులో వున్న హోటేలుకి ఎవ్వరు రారు. ఎందుకనో?... నే నక్కడికెళ్ళి లోపల గదిలో కూర్చుంటా.

కాదు. ఇంటికెళ్ళి, మాఅమ్మ దగ్గరకు పరిగెత్తి, పక్కనకూర్చొని మాఅమ్మకిస్తా డబ్బును. మాఅమ్మ నేనెంతో మంచివాడినని నన్ను ముద్దుపెట్టుకొని, ఎంచక్కా ప్రక్కనున్న వాళ్లతోగూడ "మా పెద్దవాడు చాలా మంచివాడు. నాతో చెప్పకుండా ఒక్క కానీగూడా తీసుకోడు. మా రెండోవాడే వెధవ. మొన్న అర్ధణా ఎత్తుకెళ్లాడు" అంటుంది. అప్పుడు నన్నందరూ మంచివాడ్నని అనుకొంటారు. ఎంత బాగుంటుంది. నాకెంత సంతోషం. మినపట్టు తింటున్నపుడు కూడా అంత సంతోషం రాదు. కాని మినపట్టు అనగానే నాకు నోరూరింది.

మా నాన్నగారి కిస్తేనో?... వద్దు... ఆయన డబ్బు తీసుకొని ఏమి మాట్లాడకుండా జేబులో వేసుకొంటారు. అయినా మానాన్నగారి దగ్గర చాలా డబ్బుందిగా... మాఅమ్మ దగ్గరే లేంది? అందుకని ఇస్తే మా అమ్మకే ఇవ్వాలి.

ఛా!...నే నెవ్వరికీ ఇవ్వను. చక్కగా హోటేలు కెళ్లి కొనుక్కు తింటా. మాఅమ్మ మొన్న కాని ఇవ్వమంటే ఇచ్చిందేం.

ఇల్లు దగ్గరికొచ్చింది. "ఎవ్వరికీ ఇవ్వను నేనే కొనుక్కు తింటా" అనుకుంటూ లోపలికి వెళ్లా.

సాయంకాలం దాక ఏంతోచక అటు ఇటు ఇంట్లోనే తిరిగాను. చివరకు ఎట్లాగైతే నేమి సాయంకాలమయింది. మళ్లా ఈఅర్ధరూపాయి నాదగ్గరినుంచి పోతుందేమోనని జేబులో చెయిదోపి ఆ అర్ధరూపాయిని గట్టిగా పట్టుకొనే ఉన్నా సాయంకాలముదాక. గడియారము అయిదు కొట్టింది. ఇంక బయలుదేరుదామని లేచా. "ఎండ ఇంకా తగ్గనిదే ఎక్కడికిరా పోతున్నావ"ని కేక వినిపించగానే



వెనకనుంచి ఒక కేక వినిపించింది "ఒరే వినవేరా ?"

# ★ "చండీరాణి" సమీక్ష ★



'చండీరాణి' నిర్మాత రామకృష్ణ.

క్రిందటి నెల 28 వ తేదీన భారత దేశమంతటా విడుదలయిన భరణీవారి "చండీరాణి" భారతీయ సినిమా చరిత్రలో ప్రత్యేక స్థానం ఆక్రమించుకున్నది. మూడు ప్రధాన దేశభాషల్లో ఒకేసారి తయారు కావడం, మూడు భాషల్లోనూ ఒకేసారి విడుదల కావడం, ఒక స్త్రీ తార కథ, దర్శకత్వం సమకూర్చడం, ఆ తార రెండు ప్రధానపాత్రలు ధరించడం- ఇవన్నీ "చండీరాణి"కి ప్రత్యేకత ఆపాదిస్తున్నాయి. ఈ కారణంవల్ల ఈ చిత్రం దాక్షిణాత్య సినిమా పరిశ్రమకూ, ముఖ్యంగా తెలుగు పరిశ్రమకూ గర్వకారణమైనది.

"చండీరాణి"కి కథారచన, దర్శకత్వం భానుమతి; నిర్మాణం, ఎడిటింగ్ రామకృష్ణ; పాటలు, మాటలు సముద్రాల; ఫోటోగ్రఫీ శెల్వరాజ్; సౌండ్ కోటేశ్వరరావు; సంగీతం సి. ఆర్. సుబ్బరామన్, విశ్వనాథన్; కళ శేఖర్. భానుమతి, ఎన్. టి. రామారావు, రంగారావు, రేలంగి, విద్యావతి, తులసి, హేమలత, దొరస్వామి, అమర్‌నాథ్, మున్నగువారు నటించారు.

వీరసింహుడనే రాజు ఒక పేదపిల్లను మోహించి వివాహం చేసుకుంటాడు. ప్రచండుడు అనే సేనాపతి కూడా ఆమెనే మోహించి వున్నందున, ఆమెను తనకు దక్కనివ్వలేదనే కోపంతో రాజుపై పగ తీర్చుకో దలుస్తాడు. రాణి గర్భవతియై కవల ఆడపిల్లలను కంటుంది. వెంటనే ప్రచండుడామెకు విషమిచ్చి చంపిస్తాడు. భార్యా మరణంతో మతి చలించిన రాజును ఖయిదు చేస్తాడు. విశ్వాసపాత్రుడైన మంత్రి కవలపిల్లలలో ఒకరిని ప్రచండుని చేతుల్లో పడకుండా దాసీద్వారా సురక్షిత ప్రదేశానికి పంపిస్తాడు. రెండవ పిల్లను స్వయంగా కోటవెలుపలికి తీసుకు వస్తుండగా ప్రచండుడు చూసి, మంత్రిని చంపి, పిల్లను లాక్కుంటాడు. ఆ పిల్లను తన కొడుక్కిచ్చి వివాహం చేయాలనే తలపుతో జాగ్రత్తగా పెంచుతాడు. అడవికి చేర్చబడిన పిల్ల చండీ అనే పేరుతోను, అంతఃపురంలోని పిల్ల చంపా అనే పేరుతోను పెరిగి పెద్దవారవుతారు. చనిపోయిన మంత్రికొడుకు కిశోర్ కూడా పెరిగి పెద్దవాడవుతాడు. తన తండ్రి ఎలా మరణించిందీ, ప్రచండుడెలా రాజ్యం సంపాదించిందీ, తన్ను పెంచిన రామ్‌సింగ్ అనే భృత్యునిద్వారా తెలుసుకుంటాడు. రాజవంశాన్ని ఉద్ధరించడానికి దీక్ష పూని, అంతఃపురంలో చంపను, అడవిలో చండీని కలుసుకొని తన దీక్ష తెలియజేస్తాడు. చండీ, చంపా, ఇద్దరూ అతన్ని ప్రేమిస్తారు. కాని అతను చంపను మాత్రమే ప్రేమిస్తాడు. చండీ ఈ సంగతి తెలిసి తన ప్రేమ త్యాగం చేస్తుంది. ప్రచండుని దుర్మార్గాలు అంతమొందించడానికై ప్రజా విప్లవం లేవదీసి ప్రచండునిపై దండెత్తుతుంది. అతనితో యుద్ధం చేసి చంపివేస్తుంది. కాని ఆ పోరాటంలో ఆమెకు కూడా గాయం తగులుతుంది. చెరలోవున్న తండ్రిని, మిగతా వారిని రక్షించి తను చనిపోతుంది. చంపా కిశోర్‌లకు వివాహం జరుగుతుంది.

ఈ చిత్రం ఆశయం సామాన్య ప్రేక్షకులకు వినోదం, కాలక్షేపం కలిగించడమే అయితే, చాలవరకు నెరవేరిందనే చెప్పాలి. మనస్సును కాసేపు నిద్రబుచ్చి, కళ్ళతో మాత్రమే చూసి ఆనందించగలిగితే ఈ చిత్రం తృప్తికరంగా వుంటుంది. సాధారణంగా మన జానపద చిత్రాలన్నీ ఇలా చూడదగినవే. ఆలోచించ సాగినకొద్దీ ప్రశ్నించ మొదలిడినకొద్దీ కథనిండా లోపాలు కనిపిస్తాయి.

పేదపిల్లను రాజుతోపాటు ప్రచండుడు కూడా మోహిస్తాడు. ఆమెను రాజు వివాహమాడలేనందుకే బాధపడతాడు. అంత బాధపడినవాడు నిర్దాక్షిణ్యంగా ఆమెను చంపి, రాజును ఖయిదు చేస్తాడు. ఆమెను చంపి రాజుపై పగదీర్చుకోదలిస్తే ఆమెకు సంతానం కలిగేదాకా ఆగవలసిన అవసరం లేదు.

కవల ఆడపిల్లల మూలంగా కథకు కలిగిన ప్రయోజనమేమీ లేదు. చంప పాత్ర లేకపోయినా కథ సాగించడానికి వీలున్నది. చంపపాత్రను ప్రవేశపెట్టినప్పుడు, ఆమెకూ చండీరాణికీగల పోలికను పురస్కరించుకొని కథలో విచిత్రమైన సంఘటనలు ప్రవేశపెడితే బాగుండేది. నిజానికి ఈ పోలిక సరిగా ఉపయోగించుకోబడనే లేదు. చంప స్థానంలో చండీ ఉండడంవల్ల, ప్రచండుడుగాని, అతని కొడుకు ముకుందుగాని మోసపోయిందీ, నష్టపడిందీ ఏమీ లేదు. అలాగే, చండీరాణి పెద్దపులిని యుద్ధం చేసి చంపిన సీక్వెన్సు కూడా, మొదట ఆసక్తి కలిగించి, కథాగమనంలో పరిణామాలకు దారి తీయకుండానే వృథా అయిపోయింది. చండీకి తండ్రి చెప్పిన రహస్యద్వారం సంగతి కూడా చివరికి వృథాగా వదలివేయబడింది. అడవిలో కోయదొరకూ చండీకి స్నేహం, కోయదొర చండీని పెంచిన దాసిని తగలపెట్టించడం వగైరా సన్నివేశాలూ ఇలాగే వ్యర్థంగా ప్రవేశపెట్టబడినవి. కథానాయకుడైన కిశోర్ పాత్రకూడా కథలో సాధించినదేమీ లేదు. ఒక్క చండీరాణి పాత్ర గొప్పదనంకోసం మిగతా పాత్రలన్నీ బలా



ఫోటోగ్రాఫర్ : శెల్వరాజ్.

గౌరిని కష్టాలనుండి గట్టెక్కించడానికి దేవకన్య అచల వచ్చి, గౌరిని చందన రాజువద్దకు తీసుకువెళుతుంది.
విజయావారి "చంద్రహారం" లో కాంతాదేవి, శ్రీరంజని.


కళాదర్శకుడు: శేఖర్.

ఇట్లాంటివి మినహాయిస్తే భానుమతి దర్శకత్వం బాగానే వున్నది. కోయదొరతోను, ప్రచండునితోను చండీరాణి చేసిన కత్తి యుద్ధాలు షేకింగ్ దృష్ట్యా బాగున్నాయి. కథ వీలిచ్చినంతవరకూ చిత్రంలో సస్పెన్సు పోషించబడింది. భానుమతి రెండు భిన్న పాత్రలనూ రక్తివంతంగా పోషించింది. ఆమె అభినయం ఈ చిత్రంలోకల్లా "హైలైట్" అనదగినది. కిశోర్‌గా ఎన్. టి. రామారావు, మూర్తీభవించిన విలన్‌గా రంగారావు రాజుగా అమర్‌నాథ్ సమర్థతతో నటించారు. రేలంగి హాస్యనటన ప్రేక్షకులకు కావలసినంత వినోదం కలిగిస్తుంది.

ఉన్న కొద్దిపాటలూ కర్ణపేయంగా ఉన్నాయి. కామెరామాన్ శైల్వరాజ్ ట్రిక్ షాట్లు జయప్రదంగా తీశారు. రాజభవనం సెట్ వగైరా కథా వాతావరణానికి బాగా తోడ్పడాయి. చిత్రం పొడవుకూడా నేటి చిత్రాలకంటె తక్కువే ఉన్నది కథా లోపం తప్పిస్తే, డైరెక్టరుగా, అభినేత్రిగా భానుమతికి "చండీరాణి" వ్యక్తిగత విజయం సాధించి పెడుతున్నది. ఈ చిత్రం ఇచ్చే ప్రోత్సాహంతో ఆమె ఇంకా మంచి మంచి చిత్రాలు తీయగలదని ఆశిస్తున్నాము. ★

# సినిమా వార్తలు

శ్రీ రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీవారి తెలుగు, తమిళ సాంఘిక చిత్రం "లక్ష్మి" నిర్మాణం దాదాపు ముగియవచ్చింది. అనుకున్న షెడ్యూలుప్రకారం షూటింగ్ జరిపారు. ఆఖరి సెట్టుమీద షూటింగ్ మిగిలివుందనీ, ఇంకా మిగిలిన పనికూడా ఈ నెలలోనే పూర్తి చేయగలరనీ తెలుస్తున్నది. అక్టోబరు ఒకటో తేదీకి తెలుగు చిత్రం విడుదల చేస్తారట. శ్రీ కడారి

రిస్తాడు. జమీందారు తన పాతబాకీల కింద ఆ పొలం జమకట్టుకోడానికి కోర్టువారి డిక్రీ సంపాదిస్తాడు. శంభూ కూడా తన పొలం తన చెయ్యిదాటి పోగూడదనే పట్టుదలతో, జమీందారుకు బాకీవున్న 200 పై చిల్లరా తీర్చివేయడానికి సంకల్పిస్తాడు. బాకీ తీర్చడానికి మూడు నెలలు మాత్రమే వ్యవధివున్నది. ఆ డబ్బు సంపాదించేందుకు శంభూ, ఒక స్నేహితుడి సలహామీద కలకత్తా బయలు దేరతాడు. అతనితోపాటు కొడుకు కూడా తయారవుతాడు. కలకత్తాలో ఇద్దరూ జీవనోపాధి కోసం అన్వేషణ సాగిస్తారు. అదృష్టవశాత్తూ శంభూకి రిక్షాలాగే పని లభ్యమవుతుంది. కొడుకు వేడినీళ్లకి చన్నీళ్లతోడన్నట్లు, తను బూట్ పాలిష్‌పని చేసి దానిమీద కొంతడబ్బు సంపాదిస్తాడు. ఒకరోజున రిక్షా లాగుతుండగా శంభూ ప్రమాదానికి లోనయి మంచంపడతాడు. కొడుకు పట్నానికి రమ్మని తల్లికి ఉత్తరం రాస్తాడు. ఆమె భర్త అనారోగ్యంవిషయం తెలుసుకుని గాభరాగా పట్నం వచ్చేస్తుంది. అక్కడ ఒక దుర్మార్గుడి చేతిలో చిక్కి, తప్పించుకునే ప్రయత్నంలో కారుకింద పడుతుంది. భార్యాభర్తలు కలుసుకుంటారు. భార్యకు గాయాలు నయంకావడానికి చాలరోజులు పడుతుంది. ఈలోగా మూడు నెలల గడువు దాటిపోవడమే గాక, శంభూ, భార్యా పుత్రులతో స్వగ్రామం తిరిగి వచ్చేసరికి అతని పొలంలో బ్రహ్మాండమైన ఫ్యాక్టరీ నిర్మించబడివుంటుంది. తండ్రి పిచ్చివాడై ఎటో వెళ్లిపోయి వుంటాడు. శంభూ హతాశుడై భార్యాపుత్రులతో వచ్చినదారే పట్టి, నేలవించి వేళ్లతో సహా పెళ్లగించబడిన అసంఖ్యాక భారతీయ కర్షకులవలెనే, వేరే కొత్తజీవనాన్ని అన్వేషించుకుంటూ వెళ్లిపోతాడు.

తరతరాలుగా మనదేశంలో మన కళ్లఎదుటనే జరుగుతున్న ఈ చరిత్ర ప్రేక్షకుల హృదయాలను కలచివేస్తుంది. కథావస్తువు పాతదేఅయినా, సరికొత్తగా చిత్రించడంలో బిమల్ రాయ్ ప్రతిభ కనబరచాడు. ప్రారంభ దృశ్యంలోనే కథను సూచించడానికి, బీటలు వారి ఒక్క నీటి చుక్క కోసం వెయ్యినోళ్లు తెరుచుకున్న నేల కనిపిస్తుంది. నీటిబరువుతో కదిలి వచ్చే మబ్బులు చూసి, వర్షాగమనానికి నృత్యం చేసే నెమళ్లలాగా రైతులు ఆడుతూ పాడుతూ వర్షోత్సవం చేస్తారు. ఈ విధంగా చిత్రం అంతటా వెలుగు చీకట్లలాగా ఒకదానివెంట ఒకటి వచ్చే చిన్న చిన్న సంతోషాలు, కష్టాలు చూపించబడ్డాయి. ప్రతి పాత్రా, మన మెక్కడో ఎరుగుదుమా అన్నంత వాస్తవికంగా పోషించబడింది. రైతు శంభూ, అతనికి పొలంమీదగల ప్రేమ, భార్యాబిడ్డలమీద ప్రేమ, అతని నిజాయితీ, ఇదంతా ఎక్కడా అతిశయోక్తి దోషం లేకుండా చిత్రించబడింది. కలకత్తాలో శంభూ కొడుక్కి బూట్ పాలిషింగ్ నేర్పే కుర్రవాడూ, జేబుదొంగతనం చేసే కుర్రవాడూ, శంభూకి రిక్షా యిచ్చిన రిక్షావాలా, గది అద్దెకిచ్చిన యజమానురాలూ,



పారమౌంట్ వారి "మిలిటరీ పోలీస్‌మన్" లో బాబ్ హోప్, మేరిలిన్ మాక్స్‌వెల్.



వీరంతా దైనిక జీవితంలో మనకి తారసిల్లే వ్యక్తులే అనిపిస్తారు.

చిత్రంలో ఔట్ డోర్ దృశ్యాలూ, లొకేషన్ దృశ్యాలూ విరివిగా ఉన్నాయి. చిత్రంలోని వాస్తవికతకు ఇవి ఎంత తోడ్పడ్డాయో చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. కొన్నిచోట్ల మనం చూసేది భారతీయ చిత్రం కాదనీ, ఇటాలియన్ చిత్రమో, హాలీవుడ్ చిత్రమో అనిపించే దృశ్యాలున్నాయి. కలకత్తాలో శంభూ, అతని కొడుకూ కొట్టు పెట్టగానే, ఆ నగరంలో ఏ ప్రవాహాల్లో తెలియక వారు కంగారుపడే దృశ్యాలు ప్రశంసనీయంగా వున్నాయి. ఎక్కడా కెమెరాను పెద్దకుదూ పూర్తి అధికారంతో వినియోగించుకున్నాడనిపిస్తుంది. దైనికుల ఆవాసాలను చూపించవలసి వచ్చినప్పుడుకూడా, యథార్థ వాతావరణానికి అనువైన సెట్టులే ఉపయోగించబడ్డాయి. నటీనటులందరూ ప్రతిభావంతంగా నటించారు. శంభూగా బల్రాజ్ సహానీ హిందీ నటుల్లో అగ్రగణ్యుడనిపించే విధంగా నటించాడు. శంభూ భార్యగా నిరూపరాయ్, కొడుకుగా రతన్‌కుమార్, తమ పాత్రలకు తగినట్లు సరిపోయారు. మిగతా వారుకూడా ఏ విషయమైన వంక పెట్టడానికి లేకుండా నటించారు.

ఇంతమంచి చిత్రంలోనూ, దురదృష్టవశాత్తూ కొన్ని లోపాలు ఉండడం చింతించదగినది. ఈ లోపాలే లేకపోతే ఈ చిత్రం ఇటాలియన్ చిత్రాలతో పోల్చదగినదై వుండేది. భారతీయ చిత్రాలన్నిటిలోనూ మోతాదుమించి కనిపించే 'మెలోడ్రామా' ఈ చిత్రంలోకూడా స్వల్పంగా ప్రవేశించింది. కొన్నిచోట్ల సన్నివేశాల్లో 'సెంటిమెంట్' పాలు ఎక్కువైంది. చిత్రం రెండవభాగంలో కథ పోనుపోను మామూలు సినిమాలధోరణిలో పడింది. శంభూ భార్య కలకత్తా రావడం, రౌడీ చేతుల్లో చిక్కడం, అతడామెను బలాత్కరించడం, ఆమె పారిపోతూ కారు క్రిందపడడం వగైరా సీక్వెన్సు అంతా అనవసరం. అది ప్రధాన కథతో సంబంధం లేకుండా చేర్చబడింది. శంభూ కొడుకు రెండోసారి ఒక స్త్రీ చేతిలోంచి పర్సు కొట్టేసి పారిపోయిన సంఘటన కూడా పునరుక్తి దోషంగా కనిపిస్తుంది.

ఈ చిత్రంలో నాలుగే పాటలుండడం హర్షించదగినది. అయితే నిద్రపోతున్న తమ్ముడికి కుమారి పాడిన జోలపాట ఒకటే మాత్రం పూర్తిగా అసందర్భమనిపిస్తుంది. సంగీతపరంగా ఈ పాట చాలా బాగున్నప్పటికీ అది కథాగమనానికి అడ్డుతగిలింది. మిగతా పాటలు బొంబాయి సినిమాబాణీకి అనుగుణంగా వున్నాయి. అలాకాకుండా, కథాస్థలం బెంగాల్ కనుక పాటలు కూడా బెంగాలీ బాణీలోనే వున్నట్లయితే సన్నివేశాలు యింకా రాణించేవి.

ఈ లోపాలను సవరించుకుని, చిత్రం పొడుగు మరొక రెండుమూడు వేలు తగ్గించి, కథను ఇంకా బిగువుగా నడిపించినట్లయితే "దో బిఘా జమీన్" ఏ ఉత్తమ పాశ్చాత్య చిత్రంతోనైనా సమానస్థాయిలో నిలవగలిగేది. ఇప్పుడుకూడా ఈ మాదిరి కథావస్తువుతో, నేలలోంచి పుట్టుకొని వచ్చినట్లుండే పాత్రలతో, భారతీయ జీవితాన్ని వాస్తవికంగా ప్రతిబింబించే ఈ చిత్రం మనం ఎంతైనా గర్వించదగినది. చలనచిత్రకళలో భారతీయులు ఎంత ప్రతిభ అయినా చూపగల సమర్థులని ఈ చిత్రం నిదర్శనం ★



యూనైటెడ్ ఫిల్మ్సు ఎం.ఎ. శ్యాముల్ వారి "పల్లెపడుచు" లో ఒక ప్రభాత దృశ్యంలో చలం, కృష్ణకుమారి.



* దేశపు బాగోగులు లక్షలాది రైతుల సుఖదుఃఖాల మీద ఆధారపడి వుంటాయి *

"దో బిఘా జమీన్' లో బల్రాజ్ సహానీ, రతన్‌కుమార్.

కమిషన్ దళారి, డిస్ట్రిబ్యూటింగు ఆఫీసులో బూజుదులిపే ఆఫీసు కుర్రవాడు- యిన్ని మాటలెందుకు? యీ పరిశ్రమతో బాదరాయణ సంబంధంవున్న ప్రతి జీవీ- తెలుగు చిత్రాలకు కథలు వ్రాయగలమన్న ధైర్యం అలవరచుకున్నారు. ఇక మంచి కథారచయితకు, అందులో ప్రత్యేకసాధన చేసినవానికి స్థానమెక్కడున్నది?

మన ఫిలిం పరిశ్రమకు - అంటే భారత దేశంలో మొత్తంమీదమాట - ఉత్తమ సాహిత్యంతో సాన్నిహిత్యం ఏర్పడినప్పుడే, వుత్తమ చిత్రాలు సృష్టిఅయ్యే అవకాశాలు వృద్ధిచెందగలవు. బెంగాలీలు, మరాఠీలు - తమతమ భాషల్లోని వుత్తమ కాల్పనిక సాహిత్యాన్ని, నవలలను, కథలను పరిశోధించి వాటిని ఫిలిం కథలకింద, అందులో ప్రత్యేక ప్రావీణ్యాన్ని ఆర్జించిన వారిచేత మార్పించుకొంటున్నారు. అదే వాళ్ల విజయానికి కారణం. అందులో రహస్యమేమీ లేదు ఉద్యమాలతో వచ్చిన యిమేజిషన్ దోరణినివదిలినప్పుడే మన చిత్రాలు రాణిస్తాయి. మన చిత్రాలకు వుత్తమ కవులు మంచి పాటలిచ్చినంతవల్ల వుత్తమ చిత్రాలు రాలేవు. ఉత్తమ కవులు మంచి కథకులు కాగలటం అరుదు; సందేహం ... ఉత్తమ నవలా రచయితలు, కథకులూ ఆహ్వానించబడాలి. ★

## ★ సినిమా వార్తలు ★

ఆర్థికమైన కారణాలవల్ల, ఇతర కారణాలవల్ల, పూర్తికాకుండా ఆగిపోయిన చిత్రాలకు డిస్ట్రిబ్యూటర్లద్వారా సహాయం ఇప్పించేందుకు బొంబాయిలోని భారతీయ చలనచిత్ర నిర్మాతల సంఘం (ఇండియన్ మోషన్ పిక్చర్ ప్రొడ్యూసర్స్ ఎసోసియేషన్) ప్రయత్నాలు చేస్తుందని తెలుస్తోంది. మొదలుపెట్టి పూర్తి కాకుండా ఆగిన చిత్రాలను గురించి వివరాలు సేకరించటం జరుగుతున్నాయట. ఆ వివరాలను ఒక ఉపసంఘం పరిశీలించి సహాయ కార్యక్రమం తయారు చేస్తుందట. ఇలా ఆగిపోయిన చిత్రాలు సుమారు నూరు ఉన్నాయట.

* * *

బెంగాలీ దర్శకుడు దేవకీబోస్ "భగవాన్ శ్రీకృష్ణ చైతన్య" అనే భక్తి చిత్రం తీయనున్నాడు. నిర్మాత విజయభట్ కూడా అదే కథావస్తువుతో హిందీ చిత్రం నిర్మిస్తున్నందున, దానికి పోటీ లేకుండా దేవకీబోసు బెంగాలీలో మాత్రమే నిర్మిస్తున్నాడు. వసంత్ చౌదరి, సుచిత్రా సేన్, అనితా సినా మున్నగువారు నటిస్తారట. కమల్ దాస్ గుప్త సంగీతం రచిస్తాడట. అంధ గాయకుడు కె. సి. డే కొన్ని పాటలు పాడతాడట.

* * *

పార్లమెంటు సభ్యులకు ఫిలిం పరిశ్రమతోను, చిత్రాలతోను ఇతోధికంగా పరిచయం కలగజేసేందుకు, భారత ఫిలిం డివిషన్‌వారు కొన్ని ఉత్తమ చిత్రాలను ఏరి, ప్రత్యేకంగా పార్లమెంటు సభ్యులను ఆహ్వానించి ప్రదర్శించ దలచారు. ఈ కార్యక్రమంలో మొదటిదిగా ఆగస్టు 16 న న్యూథియేటర్సువారి "యాత్రిక్" ఢిల్లీలో ప్రదర్శించబడింది. వందమందిదాకా పార్లమెంటు సభ్యులు హాజరయ్యారట.



"దో బిఘా జమీన్"లో రతన్ కుమార్, నిరూపారాయ్. ఈ చిత్రం మద్రాస్ స్టార్ టాకీస్‌లో ఈనెల 4 న విడుదల అవుతున్నది.



పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి



జంబూ ద్వీపపు మధ్య భాగమున
కామ్యకమను వనమొకటున్నది



ఆ వనమందలి ఒక పొదరింట్లో
వ్యాఘ్రమొక్కటి కాపురమున్నది



ఆ పొదకు సమీపంలో - జువ్వి చెట్టు
కొమ్మపైన - కొంగ ఒకటి వుండెడిది -
వ్యాఘ్రరాజమొసరించే - మాంసఖండ
సంతతినే - చెట్టుమీది కొంగకూడ -
చూచుచుండె వింతగాను



ఒకనాడా వ్యాఘ్రమొక
పొట్టేలును పరిమార్చెను



తగరు మాంసమును మెక్కుచు
పొరపాటున ఆ వ్యాఘ్రం
ఒక ఎముకను నమిలింది!



పొదలో చేరిన ఆ పులి
పంటి బాధ తాళలేక
గాండ్రుమనుచు మూల్గినది



ఇది అంతా తిలకిస్తూ
చెట్టుమీద నిలచివున్న
బకము పులిని చేరింది
దయాపూర్ణ హృదయంతో
ఊరడించ సాగినది



"ఓహోహో! పులిరాజా! - ఏమిటోయి
ఈ వింత? - ఇన్ని నాళ్లనుండి నిన్ను -
ఈ పొదలో చూస్తున్నా - కానీ నీ
ఆక్రందన - మేనాడూ వినలేదు!"



"నా యీ దుస్థితి నేమని చెప్పుదు? - తగరు
మాంసమును భుజియిస్తూ - ఎముకనుకూడా
నమిలాను. - నా యీ ఆపద బాపగ వేడెద! -
దయయుంచుము ఓ కృపానిధీ, నను -
కరుణించుము ఓ దయానిధీ!"



అతి దీనంగా వేడిన పులిపై
జాలిదలచినది ఆ కొంగా
పులినోటను తన ముక్కును జొనిపి
పాడు ఎముకనూ లాగివేసినది



అది మొదలుగ
పులీ, కొంగా -
గాఢ మైత్రిలో
మెలిగాయి



పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి



ఒకరోజున పులి తిండి కోసమై - అడవి యంతటా తిరిగి తిరిగి ఒక మృగమైనా దొరకక కడు - వేస్సిపోయి ఉసురుస్సురుమన్నది - ఏమి చేయుటకు తోచక తుదకూ - మిత్రమైన ఆ కొంగనే చంపి - సాపడ వలెనని తలచినది

(పులి అంతరాత్మ, పులితో) "పాపమా బకము మునుపొకసారి - ప్రాణం మీదికి వచ్చి నప్పుడు నిను - దయతో రక్షించింది కదోయీ - అంత సజ్జనుని నీవే విధముగ - చంప నెంచెదవు కృతఘ్నుడా?"



(పులి తన అంతరాత్మతో) "అవును అది నిజమే ననుకోవయ్యా; - అయితే మాత్రం ఏంజేయమంటావ్? - ఆకలితో చని పొమ్మంటావా? - 'శరీరమాద్యం ఖలు ధర్మసాధన' - మంటూ పెద్దలు చెప్పారు గదా? - పాపం గీపం ముడియూదు! - పుణ్యం చేస్తే ఆకలిపోదు!!"



అంటూ ఆ పులి రుసరుసలాడుతు పొదలో దూరి కడుపుబ్బిన చేలొల్లిబి మాదిరి నోరు తెరిచి తెగ ముక్కుతు మూల్గుతు పడుకొంది



కొంతసేపటికి మూలుగు విని మన కొంగ జాలితో కొమ్మనుండి దిగి మిత్రుని చేరి సంగతేమిటని ఆదుర్దాగా అడిగింది



"ఏమి చెప్పుదును ప్రాణమిత్రుడా! - ఎప్పటికప్పుడు నాకిట్లాగే - ప్రాణం మీదికి వస్తోంది. - నువ్వు మాత్రమూ ఎన్నిసార్లని - నా ప్రాణాలను రక్షిస్తావు? - మళ్లీ గొంతుక కడ్డంగా ఒక - పొడు ఎముక పడి చస్తున్నాను!"



"ఆదేమి నెచ్చెలి! ఈ మాత్రానికే ఇంత హతాశుడవయ్యేదవా? బలేవాడివే! ఊరుకోవయ్యా! ఆడదానివలె ఏడుస్తావా? ఏదీ నోటిని తెరువుము, చూద్దాం."



అంటూనే ఆ వెర్రి బకము రోట్లోపల తల దూర్చినట్లుగా పులి నోట్లో మెడ జొనిపినది



వెంటనే వ్యాఘ్రం కసిక్కుమని బక కంఠం కాస్తా కొరికినది



అరుణాముఖుడు (దీర్ఘముఖునితో) "కనుకనే గోముఖ వ్యాఘ్రాన్నెప్పుడు - నమ్మకూడదని పెద్దలు చెబుదురు - నమ్మిన వారికి నాశము తప్పదు!"



చిత్రవర్ణుని సేవకులు తనను పరాభవించిన విధమును, దీర్ఘముఖుడు, తన రాజైన హిరణ్య గర్భునకు - చెప్పి:..

"బోలెడు బలగం వుండికూడా, ఈ కాని దేశమున ఇడుములు పడితి. దేవరవారికి ఈ వృత్తాంతం - వినిపింతామని ప్రాణాలెట్లో - ఉగ్గబట్టుకొని వచ్చితిని - రాయబారంగా అరుణాముఖుడును ఈపాటికి యిటు వస్తుంటాడు!"



"చిత్రవర్ణునికి కాలము మూడెను! - ఎన్ని గుండెలతో అవమానించెను - పరమ సాధువగు నా భృత్యునే? - దౌరా! రేపే ఆ దుర్మార్గుని - పీచమణంచెద, దుఃఖింపకుము!"



అమృత తుల్యములు ఈ పలుకులు విని - హృదయ యావేదన ఉపశమించగా - దీర్ఘముఖుడు తన గృహమున కరిగెను.

# ప్రశ్నలు - సమాధానాలు

శ్రీ ఎమ్. మాణిక్యరావు—సికింద్రాబాదు.

భరణీవారి "చండీరాణి"లో భానుమతి చండీ - చంప పాత్రలను నటిస్తూ, కొన్ని సీనులలో ఒకరినొకరు కలుసుకొని మాట్లాడడము సంభవిస్తుంది అట్టి సన్నివేశాలను ఎట్లు ఫిల్ము తీస్తారో తెలుప ప్రార్థన

—అటువంటి దృశ్యాలను 'మాస్క్' పద్ధతిలో తీస్తారు ముందు, కామెరా లెన్సును కొంతవరకూ మాస్క్ చేసి, ఒక వ్యక్తి ఎదురుగావున్న ఎవరితోనో మాట్లాడుతున్నట్లున్న దృశ్యాన్ని షూట్ చేస్తారు. అలా ఎక్స్పోజు చెయ్యబడిన ఫిలిమును మళ్ళీ మొదటకి తెచ్చి, మళ్ళీ మాస్క్ చేసి ఆ వ్యక్తి ఇందాక నుంచున్న స్థానానికి ఎదురుగా నిలబడి, రెండవ పాత్రతో మాట్లాడుతున్నట్లు షాట్ చేస్తారు ఈ ఫిలిమును ప్రింటు తీసినప్పుడు ఒక వ్యక్తే రెండు పాత్రలు ధరించి సంభాషిస్తున్నట్టు కనిపిస్తుంది

*　　*　　*

శ్రీ కె వెంకోబరావు—ఆదవాని

"చిన్నమ్మయ్య" లో ఎదుపుకున్న వసంత చదువురాని పల్లెటూరి పుల్లయ్యవలలో పడినదని చెప్పినంత మాత్రాన ఆమె అత్తగారు, భర్త నమ్ముట సహజమా?

—కొన్ని సమయాల్లో ఎవరైనా నమ్మడం సహజమే ఆ విషయాన్ని బాగా 'ఎస్టాబ్లిష్' చెయ్యలేకపోవడం, లోపం కావచ్చు

*　　*　　*

శ్రీ ఎమ్. లక్ష్మణరావు—బొబ్బిలి

సినిమాలపై ప్రజలకు కొంతకాలానికి మోజు తగ్గి, సినిమా పరిశ్రమ అడుగంటుతుందని మా మిత్రుడంటాడు నేను దానిని ఖండిస్తున్నాను మీరేమంటారు?

—చవకగా కాలక్షేపం సప్లయి చేసే సాధనం మరొకటి లేనంత కాలమూ సినిమాలపై ప్రజలకు మోజు తగ్గదు.

*　　*　　*

శ్రీ యస్ నరసింహం—ప్రొద్దుటూరు.

వినోదావారి "స్త్రీసాహసం," "శాంతి" చిత్రాలు ఎక్కువ విజయము సంపాదించలేకపోవడం, "దేవదాసు" విజయము పొందుటకు కారణము ఏమిటి?

—"దేవదాసు" లో మంచి కథ, 'ఎంటర్ టెయిన్మెంటు,' మంచి నటన అన్నీ సమకూడినవి గనుక

*　　*　　*

శ్రీ సి. హెచ్. సుబ్రహ్మణ్యం—విజయవాడ.

సినిమా సర్టిఫికెట్లలో *U* సర్టిఫికెట్లు *A* సర్టిఫికెట్లు అని మార్చిఇచ్చుటకు కారణమేమి?

—ఇతర దేశాలనుండి వచ్చే చిత్రాల్లో కొన్ని, సెక్స్ అపీలు అధికంగా వున్నవి, విపరీతమైన భయం, ఉద్రేకం కలిగించేవి బాలబాలికలు చూడడం మంచిదికాదనే వుద్దేశ్యంతో సెన్సార్ అధికారులు ఇలా రెండురకాల సర్టిఫికెట్లు యిస్తారు 'ఎ' సర్టిఫికెట్ గల చిత్రాలు వయోజనులు (*Adults*) మాత్రమే చూడదగినవి 'యు' సర్టిఫికెట్ గలవి అందరూ (*Universal*) చూడవచ్చును.



అర్ధరాత్రి వేళ మృతినుండి మేల్కొన్న చందనరాజు తొలిసారిగా గౌరిని చూస్తున్నాడు

**విజయావారి "చంద్రహారం" లో శ్రీరంజని, ఎన్. టి. రామారావు.**



(19-వ పేజీ తరువాయి)

పదిలక్షల స్థాయిలో నున్నారు. పాదఘట్టన స్వనికి బజారంతా వేడి వేడిగా నురుసులు గక్కుతోంటే - కోలాహలం కోట్ల స్థాయిలో ప్రవేశించబోతోంది.

ఇంతలో గుంపులోనున్న ఘాంటు వేసిన బక్క ఎఱ్ఱ తెల్లాంటి ఒక కుఱ్ఱాడు, గిరగిర తిరిగి బోర్లపడ్డాడు - అలవాటు ప్రకారం బిందెడు నీళ్ళు పోసేసరికి, ఘాంటు, కర్రు వగైరా, పంకిల సలిలంతో పరిశుభ్రం చేయబడ్డాయి. ఆచారప్రకారం, పెటాల్ మోతుల కానిస్టేబుల్సు, దగ్గరకొచ్చి లేవదీయడం - ఫెళ్ ఫెళ్ అనడం-వాయిద్యం సమాప్తి—

"ఎవరు సామీ - నువ్వు"?—

.....................

"మామీదింతకోపం ఎందుకొచ్చిందో సామికి"—

.....................

"ఎవరో చెప్పు, నీకేం కావాలో చెప్పు సామీ"—

.....................

ధూమం చాల్లేదని, అర్ధ శేరు గుగ్గిలప్పొడి వేసిన ధూమపాత్ర నాశికాగ్రం వద్దకు గొనిరాబడింది - దాంతో - అసలే స్పృహ లేకుండా పడిపోవడం కూడా వెంటనే జరిగింది. తర్వాత, ఇద్దరు తమ్ము వాలుగు వీరహస్తాలపైకి, కుఱ్ఱాణ్ణి ఎత్తుకొని, ఇంట్లో మంచంపైకి చేర్చారు. ఇంత సంతోష సాగరాన బడి మునిగిపోయే గృహమంతా, ఒక్కసారి ప్లేటుమారినట్లు, విషాదసాగరాన పడిపోయింది. మంచం చుట్టూ జేరి, తలోమాట సాగించారు.

"ఏ దేవరో తెలియకుండా వుందే?

"అసలే బక్కప్రాణమ్మనిసి"

"కాలుక్రింద బెట్టి నొక్కడుగాడు! పాపం! కట్టబడి, రైలు టేసన్ నుండి, ఆరుకోసులు నడిసొచ్చిండు!"

ఇంతలో కొంచం శైత్యోపచారాలు జరుగుతున్న సమయంలో, ఒక పేరంటాలు- "సల్లగా తేరితే, మళ్ళీ పెద్దకొడుకు పెళ్ళికి, పెద్దవీరుల కొలుపు కొలిపిస్తా తండ్రీ!" అని మ్రొక్కింది.

వెంటనే కళ్లు విప్పాడు ఘాంటు కుఱ్ఱాడు; "అమ్మయ్య!" అన్నారు అందరూ.

* * *

శేషాచలం పుట్టినప్పటినుండీ, విజయవాడలోనే పెరిగాడు. తండ్రి లేకపోయినా, తల్లే,వున్న చిన్న దాబాని, సొంతం అద్దెలకిస్తూ, వచ్చే ఫలసాయంతో జీవయాత్ర సాగిస్తూ కొడుకును ఎల్లానో స్కూల్ ఫైనల్ వరకీడ్చుకొచ్చింది.

శేషాచలం మేనమామలు, నైజాం సింగరేణి కాలరీస్‌కు పదిమైళ్ళల్లో వున్న మన్నెంలో వుంటుంటారు. మన్నెంలో ఒక యాభై యిళ్ళకంటే ఎక్కువలేవు - అక్కడవున్న అడివంతా కొట్టేసి, ఒక నలభై ఎకరాల ఎఱ్ఱ చెక్క నేలతో, ఒక మూడు దశాబ్దాలనుండి, కాలక్షేపం చేస్తున్నారు.

పెద్ద మేనమామ, తన "పెద్దకూతురికి పెళ్లి చేస్తున్నాను, పెళ్ళిలో వీరుల కొలుపు కూడా వుంటుంది. తప్పక రావాలి, తప్పక రావాలి." అని శుభలేఖ పంపడం - అందులో వేసవి కాలపు సెలవులు కావడం- సర్దాగా బయలుదేరి, మన్నెలన్నీ చూద్దామన్న కాంక్షతో, తల్లిని ఇంటిదగ్గిరే వుంచి బయలుదేరాడు శేషాచలం.

సింగరేణి కాలరీస్‌లో ట్రైన్ దిగేసరికి, ఉదయం పదిగంటలైంది. మార్తాండుడు చేతుల్లో నిప్పులు చెరుగుతున్నాడు. భయపడక కాలికి బుద్ధి చెప్పాడు శేషాచలం.

"అంతా చిట్టడివి. చిట్టడివి మధ్య గతుకుల బండ్ల పొంతనబడి, మెల్లగా వెళ్ళుతున్నాడు. కనుపించిన లంబాడి పడుచులనెల్లవారి అడుక్కొంటూ, రెండుమైళ్లు నడిచేసరికి, కాళ్ళు లాక్కొచ్చాయి.

పాపం! ఇంతసేపూ తనను మోసిన కాండిల్సును, సంచిలో దూర్చి, విశ్రాంతి తీసి కోమన్నాడు. ఎఱ్ఱదుమ్ములో పాదాలు కమ్మగా వేగుతోంటే, తొడిగిన సిల్కుషర్టు, చక్కగా తడిసి ముద్దైయి కూర్చుంది. అలాసే - కనుపించిన లంబాడీ తండాల్లో జొరబడి,దొరికిన చిక్కని నీళ్లు త్రాగుతూ, మధ్యాహ్నం ఒంటిగంటకు, మన్నెం చేరాడు. రాక రాక వచ్చిన మేనల్లునకు, మేనమామలు, ఘనస్వాగతం యిచ్చారు.

తెల్లవారే వీరుల కొలుపు. ప్రొద్దున్నే రెండు గొర్రెపోతుల్నీ, వలసిన సామగ్రితో, మగవారందరూ, పిల్లల్తో సహా, వూరికి వుత్తరంగా వున్న నక్కలేటికెళ్లారు. అచ్చట స్నానసంధ్యలైంతర్వాత, వాపెడు లావు బొర్రలున్న కడవలనిండా, తెల్లగా నురుగుతేలే, సోమరసం తెప్పించబడింది.

ప్రొద్దున్నే కాఫీతాగే ప్రాణిమైన శేషాచలం, తప్పనిసరిగా అందరి బలవంతంతో కాఫీకి బదులు ఈ తెల్లకాఫీని, పుచ్చుకోవలసివచ్చింది. ఒక్కో మేనమామ పట్టి బలవంతంగా, కొంచం బాగానే త్రాగించారు.

ఎన్నడూ రుచిచూడనివాడు సోమరసపానాన్ని రుచిచూడడం, గుగ్గిలపువాసన, దాదాపు పన్నెండుగంటలవరకు భోంచేయకుండుటం, ప్రొద్దుటనుంచి ఎండలో మలమలమాడడం - పూరెగింపుతో పాటునడచి రావడం, ఇన్ని చిత్రగతులుగా నడచిన శేషాచలం, మేనమామల ఇంటిదగ్గర కొచ్చేసరికి కళ్లుదిరిగి క్రిందపడ్డాడు.

మేనమామలతోపాటు, అందరూ,ఏదో దేవర పూనిందని, నీళ్లు కుమ్మరించడం, గుగ్గిలపు ధూమం వేయడం, పెటాల్ మోతులను మ్రోగించడంతో, నోటమాట లేక, బుఱ్ఱతిరిగి స్మృతిలేకుండా పడిపోయాడు.

మళ్లీవీరుల కొలుపు కొలిపిస్తాం-అన్న మాట చెవులబడేసరికి, శేషాచలానికి స్మృతికలిగింది. తిన్నగాలేచి, ఒకగ్లాసు చిక్కని మజ్జిగ పుచ్చుకొని, మామూలు స్థాయికొచ్చాడు.

"ఏదంత్తా! మళ్ళీ వీరుల కొలుపా?

"ఏంనాయనా, ఎల్లావుంది?"

"బాగేనేవుంది!-" అని చేతులు చూపించాడు. రెండు చేతులపై రెండు రెండు కదుములు కట్టివున్నాయి.

"ఏం నాయనా! యింతమాత్రానికేనా? అవి వీరుల కొలుపు పెటాలేగా?"

"అయితే నాకెందుకెయ్యాల్సొచ్చింది యీ పెటాల్?"

"నీకు పూనకం రాలేదా?"

"పూనకమా!" అందుకనే మామయ్యలు, మంచి బహుమానం యిచ్చారు."

"ఇదేమిటి నాయనా! ఇట్లా మాట్లాడతావు? దేవరకోప్పం రాదూ?"

"దేవరకేమోగాని, వీరమావయ్యలకు మాత్రం కోపంవస్తే బ్రతకలేమబ్బా!"

"ఏందిరా శేషీ - పెద్దలెక్కిన్లా మాట్లాడతవ్?—"

"మావయ్యా! ఇంతకూ - నాకు పూనకరబట్టిందంటావ్?"

"పట్టలేదని ఎవరంటారు?"

"బాగా నేవుంది!—నేను చచ్చి చెడి, నిన్న అంతా ఎండలో నడచివచ్చి, ఇవ్వాళ ఇంతవరకు కాఫీ అయినా త్రాక్కుండా, మీబలవంతాన ఆ ముదనష్టపు నీళ్లుత్రాగి, ఎండలో మాడి, కళ్ళు తిరిగి క్రిందబడితే, గ్రహించకుండా పెటాల్ మోతులతో బాత్తారా?"

అందరూ కళ్లు తేలవేశారు. —

# ★ సత్యం పెళ్ళి ★

(17-వ పేజీ తరువాయి)

శరస్వతి కలసి ఒకటే పుత్తరాలట. అంతా విద్దూరం - వేలెడు లేరు - అప్పుడే ప్రేమలు. ఈ రోజుల్లో పిల్లలకు త్వరగా పెళ్ళి చేయాలి నాయనా.'

ఈతి బాధలవల్ల ఎన్నోసార్లు చితికిన ప్రణయానికి జీవం పోసుకుంటూ బ్రతికిందామె. అందుకనే ఆ ప్రణయానుభవంలోని ప్రమాద ప్రమోదాలు చక్కగా తెలుసు. ల్లలకేం తెలుసు పెద్దల మనసులు - తప్ప కేని తన జీవితంలోని మధురానుభవాన్ని పెద్దకొడుకు కప్పుడే ప్రదర్శించిన ప్రణయాతి రేక సహాయాన, చిన్న కొడుక్కు కూడ ముద్దామన్న తహతహా జాస్తి అయింది.

'సత్యానికి యివ్వాళగూడ ఎవరో పిల్ల నిస్తామన్నారు.'

సుందరానికి తలపోతల బలంతో అన్న మనవసరమనిపించింది. ఏకాకిగా ఒక సుందరి సమక్షాన గడపగలిగిన జీవిత మతని మనస్సులో స్వరూపం పొందుతోంది.

గగనకుసుమాలన్నీ తన పుష్పవాటికలో సుర ప్రసూనాలయిన ఈ క్షణంలో ఎవరి కయినా సరే ఈ స్వర్గానందాన్ని కావన కలదా!

'వాడి కిష్టమేనా'

'చిన్నరుంక, వాడిదేముంది.'

గత జీవితంలో తాను ఎన్నడూ కాదన లేని పురుష సంపర్కమూ, తన భర్త ఆప్యాయంగా అంగీకరించి, సేవించిన స్త్రీ సాంగత్యమూ, ఆవిడకు ప్రకృతి నైజాన్ని ప్రస్ఫుటంగా వెల్లడించినయి. తన సంత తికి యింతకంటె వేఱే వుద్దేశ్యాలుండటం అసహాజమని, ఆ కుర్రకుంకకు తానే ఆలోచించి పెట్టింది. అనుభవజ్ఞులు ,హర్షించిన ఈ తీర్మానాన్ని, ఈ ఎదిగే తారముందు అంగీకారార్థ ముంచింది. ముసురుకుంటున్న ప్రణయమేఘాల వెనుక దాగుడుమూత లాడుకుంటున్న ఆ లక్ష్మీ ప్రియుడికి ఆలోచనకు వ్యవధి లేకపోయింది. అంగీకారం సునాయాసంగా సూచించాడు.

గత రాత్రి కలిగిన తీయని పులకరింపుల తోనే, ఆఫీసులో ప్రవేశించాడు. అంతా రామమూర్తి చుట్టూ చేరి అభినందిస్తున్నారు. రామమూర్తికి ప్రమోషన్ వచ్చింది. తను స్కూల్ ఫైనల్ - రామమూర్తి బి. ఏ. అందుకని తనకు రావలసిన ప్రమోషన్ రామమూర్తికి వచ్చింది

మర్యాద తరిగిన మనస్సు అందరితో పాటు రామమూర్తి నభినందింప జేసింది. ప్రపంచం వేసిన ఈ తీవ్రాఘాతానికి తను కారణమూ, దైవమూ!

ఆలోచన తెగేసరికి ఆఫీసు మూసే వేళయింది. యింటికి వెళ్లేత్రోవలో సుదర్శనం కనిపించి, సిగ్గుపడుతూ చెప్పాడు, తన పెళ్లి నిశ్చయమైందని. అభినందించి గడ్డినవ్వు నవ్వాడు.

ఇంటికి వెళ్లేసరికి తల్లి ఎదురై,

'సత్యానికి పెళ్లి నిశ్చయమైంద'ని సంతోషంగా చెప్పింది.

దూరాన ఆకాశపుటంచును తాకుతున్న గొప్ప మేడను విశాలాకాశంలో తేలియాడే మేఘం కప్పేసింది. అతడి నిట్టూర్పు వేడిగా గుండెలకు తాకిందిగాని మేఘాన్ని చేరలేక పోయింది.

నెలరోజుల తర్వాత సత్యం పెళ్ళి సుందరితో వైభవంగా జరిగింది. ఇదంతా వింటున్న పాలిని అన్నయ్యను ప్రశ్నించింది.

'ఇదేమిటి! యిందులో కథానాయకుడే రాలేదేం. అతడు చూసి వరించి పెళ్ళి చేసుకోవద్దూ'

'ఇది కాశీమజిలీకథ కాదే పిల్లా...'

★ ★

---

"బతీవాడాయ్?"- అని ఒక అత్త ఉవాచ—

"సదువుకోన్న మొగాడాయ్-" అని ఒక చదిన పరిహాసం—

"పారపాటైందిలేరా!" అని ఒక మావ పరామర్శ,

ఎలానో అప్పటికప్పుడు, కాసినికాఫీ కాచియిచ్చారు; రెండు గుక్కలు మ్రింగి, ఒక గంట విశ్రాంతి తీసికొని, రాత్రి, పెళ్లైంతర్వాత, మేనమామను బండికట్టమని మళ్ళీ సింగరేణి కాలరీస్ చేరి, ట్రైన్ ఎక్కి ఇల్లుచేరాడు.

ఆనాటినుండి, "పీటలకోలుపు" అన్న మాట చెవినిపడ్డేసరి, గుండె ఝల్లుమని, రెండుచేతులను మూచుకొంటాడు.

★

---

ప్లైక్లాసులోకి వెళ్ళిన ... కూతురు వాళ్ళ నాన్న ... గింది: "నాన్నా! నాకో పుస్తకాలికి అట్టవేసి ... తావా?"

తండ్రి: "తీసుకురా తల్లీ అ, ఆలు దిద్దుతున ... రెండో కూతురడిగింద: "నాన్నా నాపలక కూ... వేసి స్తావ్?" అని.

—శ్రీ పోరంకి ఆనందం, ఆలమూరి

---

# ★ సినిమాకథ ★

(24-వ పేజీ తరువాయి)

అమ్మాయీ కలిశాక, అందులో కారు తిరిగాక, మామూలుగా కథల్లో ... పుట్టకుండా వుండదే! అయితే కా... కథలో అట్లాంటిది ఎందుకు పుటలేదా ... పించింది. సిగ్గుపడి ఆ ప్రేమ విష... నాతో వాడు చెప్పడం మానేసివుంటా...

వాడి సినిమాకథ ఓపిగ్గా విన్నాం... నన్ను ఇంటిదాకా దిగబెట్టేడు. నా ఆకథ విన్నందువల్లేమో ముఖ్యంగా చివరని అట్లాంటి ఘోరమైనది వినడం ... నేమో తల తిరుగుతూ... ఇంకా ... వచ్చానా లేదా అని అనుమానంపీడించి మనస్సంతా ఏదో పాడైనట్లు అనిపించి...

ఇంతల్లో మిత్రుడు సుబ్బారా... వచ్చాడు. వాడితో జరిగిన సంగతి ... తూంటే నాకు ... క్క వాంతి అయి... దాంతో నా మనస్సులో ఆరాటం కొ... తగ్గింది.

"ఎంత పనిచేసిందిరా కామేశం క... అన్నాడు సుబ్బారావు. మన సత్త్వ... రీత్యా కామేశంలాంటి ప్రయోజ... ఎందుకు అధికం అవుతారో సుబ్బార... వివరించాను.

---

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu ChettySt, Mad